# "హెర్క్యులిస్ సైకిల్‌ని అమర్చడంలో ఏ విధమయిన సమస్యా లేదు... అంతే కాదు, దీనిని కొన్నవారు ఎవరూ ఫిర్యాదు చేయడానికి అవకాశమే లేదు"



యన్.ఆర్. ముత్తుస్వామి
సైకిల్ మెకానిక్, సేలం, తమిళనాడు.

సైకిల్‌ని అమర్చడం సులభమయిన పని కాదు. కాని, హెర్క్యులిస్ సైకిల్ తీసుకుంటే ఆ పని నాకెంతో సంతోషం కలిగిస్తుంది. హెర్క్యులిస్ ప్రతి విభాగమూ సరిగ్గా సరిపోతుంది— అమర్చేటప్పుడు కష్టపడి సర్దుబాటు చేయవలసిన పని వుండదు. నిజానికి, ఒక గంటలోపునే హెర్క్యులిస్‌ని నేను అమర్చగలను. (కొన్ని సైకిళ్ళకి, ఆ పనికి రెండు గంటలవరకూ పట్టుంది) హెర్క్యులిస్ సైకిల్‌ని అమర్చడంలో కాలం మిగుల్తుంది, శ్రమా తగ్గుతుంది. అంతేకాదు, దీనిని కొన్నవారు ఎవరూ ఫిర్యాదు చేయడానికి అవకాశమే లేదు

హెర్క్యులిస్ నాణ్యత గురించి అనేక మంది సైకిల్ మెకానిక్‌లు ఘనంగా చెప్పడానికి ఎన్నో సబబయిన కారణాలు వున్నాయి

## హెర్క్యులిస్ : పరీక్షించడం లోనూ, నాణ్యతా విధానాలు అమలు పెట్టడంలోనూ పూర్తి శ్రద్ధ తీసుకుంటారు.

ప్రతి హెర్క్యులిస్‌కి ముడిపదార్థాలని పరీక్షించడంతో సహా 67 పరీక్షలు విడిగా చేస్తారు.

ప్రతి బ్యాచ్ నుంచి ఒక హెర్క్యులిస్‌ని తీసుకుని 'చిత్రహింస' పరీక్ష చేస్తారు— అంటే ఒక వారం రోజులు విరామం లేకుండా తిరిగేటట్లు చూడడం!

రిమ్ములు, ట్యూబ్‌లు మరియు టైర్లు డన్‌లప్ నుంచే కొంటారు. (టిఐ సైకిల్స్ శ్రేష్ఠమయినవాటినుంచే కొంటుంది.)

## మీ హెర్క్యులిస్: సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా ప్రత్యేకమైన బాల్ బేరింగ్‌లు

రెండు పూర్తి వరసల హై-క్రోమ్ స్టీల్ బాల్స్ సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా వుంటుంది. మరియు ఎక్కువ బరువులు తీసుకువెళ్ళేటప్పుడు సులభ మయిన ఫ్రీ-వీలింగ్‌కి తోడ్పడతాయి. హెర్క్యులిస్ బాడీ హై-బేకెడ్ ఎనామల్ మరియు హెవీ క్రోమియమ్ ప్లేటింగ్‌లతో తుది మెరుగులు యివ్వబడింది. ఫలితం : మీ హెర్క్యులిస్ సైకిల్ తన అంద మయిన ఆకారాన్ని సంవత్సరాల తరబడి కాపాడుకుంటుంది.



హెర్క్యులిస్

TIC-2251

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938 – 1972]
శుక్రవారం : 19–12–'80
రౌద్రినామ సం. మార్గశిర శు. త్రయోదశి
**సంపుటము 74 : సంచిక 14**
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 54–60
ఆరు మాసాల చందా రు. 27–30
విడి ప్రతి వెల ఒక రూపాయి
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ–520 003


# విషయానుక్రమణిక

# ఉత్తరాలు

## ము ఖ చి త్రం

ఈ వారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక [28.11.80] ముఖ జ్యోతి జ్యోతి [సినీతార ముఖ చిత్రం]తో వెలుగొందినదనుటకు సంతసించుచున్నాము. హైందవ స్త్రీ సహజ సౌందర్యాన్ని ముఖ్యంగా పసుపుపచ్చని చీరలో, సరి అయిన కట్టు బొట్టుతో సహజ ఆభూషణాలంకృతమైన ఇలాంటి ముఖచిత్రం ఈ మధ్య మేము ఎన్నడూ చూడలేదు. ఇలాంటి సహజ ప్రకృతి సంబంధిత ముఖ చిత్రాలతో మా అభిమాన వార పత్రిక మా ముందు ప్రసన్న వదనయై నిలుస్తుందని మేము ఆశిస్తాము.

వి. రాజేశ్వరి, ఏ.బి. ఉమాశంకర్ [పామిడి]

* * *

ఈ వారం పత్రిక ముఖచిత్రం నాకు ఎంతో ఆనందాన్ని యిచ్చింది. కాటుక కళ్లతో, నుదుట కుంకుమ బొట్టుతో, చేతులకు నిండుగా వేసుకున్న గాజులతో, తలలో తురుముకున్న పువ్వులతో, పట్టు చీరెతో తెలుగువారి సాంప్రదాయాలను తెలియజేసే నటి జ్యోతి ముఖచిత్రం పత్రికకు ఎంతో అందాన్ని యిచ్చింది. ఎప్పుడూ సినీనటులు, నటీమణుల ముఖ చిత్రాలను చూసి విసుగు చెందిన నాకు ఈ వారం పత్రిక ముఖచిత్రం పూర్తి సంతృప్తిని యిచ్చింది.

పి. వి. రామనాధరావు [మధిర]

## సి ని మా

14.11.80 నాటి పత్రికలో జి.వి.జి. వ్రాసిన వింతలు—విచిత్రాలు లో కలకత్తా డాలీగంజ్ లోని ఓ థియేటరులో . . అని వ్రాశారు. అది డాలీగంజ్ కాదు టాలీగంజ్.

జోశ్యుల నాగేశ్వరరావు [కలకత్తా]

## "బా న్సా య్"

బాన్సాయ్ పద్ధతిలో పెంచిన వృక్షాల ఫోటోలు బాగున్నాయి.

చీలా అనీతాసాగర్, మధు (జనగామ)

## ఫా లా క్షు ని డై రీ

నా అభిమాన నటి జ్యోతి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రపత్రిక చాలా అందంగా, ఆకర్షణీయంగా, ఆనందంగా, ఆదర్శముగా ఉంది. ఫాలాక్షుని డైరీలోని విశేషాలు విజ్ఞానదాయకంగా ఉంటున్నాయి. సినిమా విశేషాలలోని వర్ణచిత్రాలు నూతన కాంతులుతో, కనులపండువుగా ఉన్నాయి. ఈ వారం కార్టూన్స్ మరీమరీ నచ్చాయి. కథలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి. ప్రేమతీర్థం సీరియల్ రసవత్తరంగా ఉంటూంది.

నర్రా మహేష్ (గుడివాడ)

## లోకంపోకడ • ఊమెన్









## సీరియల్

# రాగలహరి

### శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాదు

(గతసంచిక తరువాయి)

పల్లవికి సహాయంకోసం తన తల్లిని పిలిపించాడు చరణ్.

పెద్దగా అత్తగారు అరళ్ళు పెట్టక పోయినా, అప్పుడప్పుడూ సూటిపోటిమాటలు విసురుతూ వుండేది శాంతమ్మగారు. కాని, ఆవిడ కూడా ఇప్పుడు పల్లవిని ప్రత్యేకంగా చూసుకుంటోంది. ఏపనీ చెయ్యనివ్వడంలేదు. అన్నం కొసరి, కొసరి తినిపిస్తోంది. ఇష్టమైనవన్నీ చేసి పెడుతోంది.

చరణ్ కి వీలుకానప్పుడు ఆస్పత్రికి తనే తీసుకువెళ్తోంది కోడల్ని.

పల్లవికి పుట్టింటి వసతి లేదు. తల్లీ, తండ్రీ లేరు. అన్న కళ్ళనీళ్ళు తుడవడానికన్నట్లు పల్లవిని పురిటికి పంపమని రాశాడు. వాళ్ళుండేది పల్లెటూరు కావడం వలన పంపడంలేదనీ, పురుడు ఇక్కడే పోసుకుంటుందనీ బదులు రాశాడు చరణ్.

అత్తగారు పసుపు—కుంకుమ వేడుకను ఘనంగా చేసింది. ఇన్నాళ్ళకి కోడలి కడుపు పండుతోందని అన్నిటికీ హడావిడి చేస్తోంది ఆవిడ!

తొమ్మిదో నెల నిండింది పల్లవికి. పురుడెప్పుడు వస్తుందంటే అదిగో ఇదిగో అంటున్నారు డాక్టర్లు! పదో నెల సగం జరుగుతోంది. చాలా భారంగా వుంది పల్లవి. వళ్ళంతా నీరు పట్టింది. డాక్టర్లు కొంత మందికి అది సహజ మన్నారు. కానుపులో పోతుందన్నారు. ఒకచోట కాసేపు కూచోలేక పోతోంది.

ఒకరోజు అర్ధరాత్రి నొప్పులు ప్రారంభమయ్యాయి. చరణ్ టాక్సీ తీసుకొచ్చి, నర్సింగ్‌హోంలో చేర్చాడు.

శాంతమ్మగారు పల్లవి పక్కనే వుంది సహాయంగా! తెల్లవారినా పురుడు రాలేదు ఆరోజంతా [illegible]

చాలా నీరసంగా వుండటం వలన నొప్పులు తీసుకోలేకపోతోంది.

డాక్టర్ వచ్చి మళ్ళీ జాగ్రత్తగా పరీక్ష చేసింది. సహజంగా డెలివరీ అయ్యేటట్లులేదనీ, ఆపరేషన్ చేసి బిడ్డను తియ్యాల్సి వుంటుందనీ చెప్పిందావిడ.

ఆపరేషన్ అనేటప్పటికే పై ప్రాణాలు పైనే పోయాయి చరణ్ కి. డాక్టర్లు ఎంతో నచ్చచెప్పిన మీదట అంగీకరించాడు. అప్పటికప్పుడు పల్లవిని గవర్నమెంట్ హాస్పటల్లో చేర్చాల్సి వచ్చింది. మేజర్ ఆపరేషన్ చెయ్యాల్సి వచ్చింది. కడుపులో బిడ్డ అడ్డం తిరిగిందన్నారు. ఆపరేషన్ థియేటర్లోకి పల్లవిని తీసికెళ్ళుంటే కన్నీళ్ళాగలేదు చరణ్ కి. తలుపులు మూసుకున్నప్పటి నుంచీ క్షణాలు లెక్కబెట్టుకోవడం ప్రారంభించాడు.

డాక్టర్లు ఆపరేషన్ చేసి బిడ్డని బయటికి తీశారు. కానీ— ఆపరేషన్ చేసేటప్పుడే మరో విషయమూ బయటపడింది. కడుపులో పెద్దకాయ వుందిట! దానినిచూసి మొదట్లో ఇంకో బిడ్డేమోనని భ్రమపడ్డారు—డాక్టర్లు. కానీ, కాదని తరువాత తెలిసింది—అది కాయ అనీ— వెంటనే తీయకపోతే ప్రమాదమనీను. వెంటనే దాన్ని ఆపరేట్ చేసి తీసేశారు. ఈ రెండురకాల ఆపరేషన్లు జరగడానికి కొన్ని గంటలు పట్టింది. బాగా మత్తు ఇవ్వాల్సి వచ్చింది పల్లవికి.

బైటకూర్చుని వున్న చరణ్ కీ—శాంతమ్మ గారికీ ఒకటే కంగారుగా వుంది. ఎంతకీ తలుపులు తెరవరేం? అసలేం జరుగుతోందో?

డాక్టర్లు—స్పెషలిస్టులూ కంగారుగా ఆ రూములోకి వెళ్ళడం చూస్తున్నారు. మరీ కంగారుగా వుంది.

పల్లవి బతుకుతుందా?

క్షణక్షణం ముళ్ళమీదున్నట్లు మూసివున్న తలుపులకేసి చూస్తూ కూర్చున్నారు.

కొంతసేపటికి పసిబిడ్డ ఏడుపు వినిపించింది. అది వాళ్ళందరికీ కర్ణామృతంలాగా తోచింది! కొంతవరకు ముఖాలు వికసించాయి!

అయినా తలుపులు మాత్రం తెరువబడ లేదు. ఏం పిల్ల? చెప్పరేం? ఆత్రుతని ఆపుకోలేక పోతున్నాడు చరణ్. ఆ తరువాత గంటా గంటన్నరకి దేనికో బయటికి వచ్చిన నర్సుని అడిగాడు చరణ్—విషయం చెప్పమని.

"డెలివరీ అయింది. ఆడపిల్ల— పేషెంట్ కండిషన్ చాలా క్రిటికల్‌గా వుంది. ఇప్పుడే ఏమీ చెప్పలేము."

కంగారుగా— హడావిడిగా వెళ్ళిపోయింది మళ్ళీ ఆమె లోపలికి.

ఎన్నెన్నో—ఏవేవో అడగాలనుకున్న చరణ్ ఆగిపోయాడు.

సంతోషం— భయం. ఆదుర్దా —విచారం పోటీ పడ్డాయి అతడి మనసులో!

### 4

ఆ తరువాత బయటికి వచ్చిన డాక్టరుతో అన్ని విషయాలూ వివరంగా మాట్లాడాడు చరణ్.

"మిస్టర్ చరణ్... యూ ఆర్ లక్కీ. ఆమెకి ప్రమాదం తప్పినట్లే. ఆమె కింకేం ఫరవాలేదు. లక్కీగా ఆ కాయని యిప్పుడే కనుక్కోగలిగాం. లేకపోతే చాలా ప్రమాదమయ్యేది. ప్రాణభయంలేదు యిక" అన్నారు డాక్టరుగారు.

డాక్టర్లు, స్పెషలిస్టులు అంతా బయటికి నన్నూ ఆ విషయమే డిస్కస్ చేసుకొంటున్నారు. "థాంక్యూ డాక్టర్. థ్యాంక్యూ వెరీ మచ్." మనస్ఫూర్తిగా అన్నాడు చరణ్.

**జరిగినకథ — 1 :** ఆదర్శ దాంపత్య జీవితం సాగిస్తున్న చరణ్, పల్లవిలకు సంవత్సరాలు గడుస్తున్నా పిల్లలు కలగక పోవటంతో, బంధువుల దృష్టంతా వాళ్ళ మీదే వుండేది. కొంత కాలానికి పల్లవికి 'గొడ్రాలు' అన్న పేరు స్థిరపడి పోయింది. ఓ శుభ ముహూర్తాన ఆమె కడుపుతోందన్న వార్త ఆ దంపతులను ఆనంద పరచినా, బిడ్డ నెత్తుకునేవరకూ నమ్మకం లేదేమో! అన్న అనుమానం వాళ్ళని విచార సాగరంలో ముంచెత్తుతూ వుంటుంది.

"ఫరవాలేదు ఇట్సాల్‌రైట్! అది మా డ్యూటీ. తరవాత ఇంకో సంగతి చెప్పాలి మీకు..." అంటూ ఆగారు డాక్టరుగారు.

"ఏమిటది?" అడిగాడు ఆతృతగా చరణ్.

"ఏం లేదు. ఆవిడకి ఇంక మళ్ళీ కాన్పు వస్తే ప్రమాదం అందుకని యింక పిల్లలు పుట్టకుండా ఆపరేషన్ చెయ్యాలనుకొన్నాం. కానీ ఆమె చాలా వీక్‌గా వుంది. ఈ రెండు ఆపరేషన్లే తట్టుకోవడం కష్టమయింది ఆమెకు. వీటినించి రికవర్ కావటానికి చాలా టైము పట్టొచ్చు."

చరణ్ ఆదుర్దాగా చూస్తున్నాడు అతడి ముఖంలో తెలియని ఆందోళన— డాక్టరుగారు మళ్ళీ చెప్పారు కాసేపాగి— "ఈ పరిస్థితిలో నేనొక అడ్వయిజ్ ఇస్తాను, మీరేమీ అనుకోక పోతే..."

ప్రశ్నార్థకంగా చూసాడు చరణ్.

"మీరు ఆపరేషన్ చేయించుకుంటే మంచిది." ఒక్క క్షణం నిర్ఘాంత పోయినా మళ్ళీ మామూలుగా మారిపోయాడు చరణ్.

"సరే డాక్టర్... అట్లాగే... థ్యాంక్యూ వెరీమచ్... మీ సలహా తప్పకుండా పాటిస్తాను." అని ఆగి, "డాక్టర్. ఆమెనిప్పుడు చూడవచ్చా?" అడిగాడు

"ఓయస్... దానికేం చూడవచ్చు... కానీ ఆవిడిప్పుడు స్పృహలో లేదు. కొంత టైము పట్టొచ్చు స్పృహలోకి రావడానికి— యూకెన్ సీ యువర్ బేబీ..." అని వెళ్ళిపోయారు డాక్టరుగారు.

లోపలి కెళ్ళారు చరణ్, అతనితల్లి.

బేబీ చాలా హెల్దీగా వుంది సదపొన్నట! రబ్బరుబొమ్మలా వుంది. పల్లవి ప్రాణంలేనట్లు మంచం మీద వుంది. సెలైన్ వాటర్ ఒక పక్క, రక్తం మరో పక్క ఎక్కిస్తున్నారు. చూడలేక పోయాడు చరణ్!

*  *  *

మూడు రోజులదాకా సరిగా స్పృహ లేదు పల్లవికి. పదిరోజుల దాకా సరిగా మాట్లాడ లేకపోయింది. నెలరోజులు హాస్పిటల్లోనే వుంచాల్సి వచ్చింది. పల్లవి నిర్లిప్తంగా చూస్తూ వుండేది.

మూడు నెలలు అయితేగానీ మామూలు మనిషి కాలేకపోయింది. అప్పటికి మళ్ళీ నవ్వుతూ మాట్లాడే పల్లవిని చూసి చాలా సంతోషించాడు చరణ్.

ఐదోనెల వచ్చాక ఫంక్షను చేసి పాపకి పేరు పెట్టారు.

అప్పటికి పాప ఒళ్ళుచేసి, బోర్లా పడుతోంది. బోసినవ్వులు కురిపిస్తూ, మనుషుల్ని గుర్తు పట్టడానికి ప్రయత్నిస్తూ, రంగుల్ని చూస్తోంది.

పట్టుకుచ్చులాంటి ఉంగరాల జుట్టూ, బూరె బుగ్గలూ, చక్రాల్లాంటి కళ్ళూ ముఖ్యంగా ఆకర్షించేవి అందర్నీ! పాపకి 'శృతి' అని పేరు పెట్టారు, పల్లవి ఇష్ట ప్రకారమే. చాలా బావుంది అన్నారు అందరు గూడా! పాప పుట్టాక ఆ ఇంట్లో రోజూ పండగలాగే గడిచిపోతోంది నిత్య కళ్యాణం— పచ్చతోరణమే అన్ని వేడుకలూ జరిగాయి పాపకి— ఏడాది లోపల!

## 5

ఆ రోజు "శృతి" మొదటి పుట్టినరోజు. నెల పుట్టిన రోజులు కూడా వేడుకగా చేస్తోంది కదా పల్లవి. ఇంక ఆరోజు పల్లవి హడావిడి అంతా యింతా కాదు! పొద్దున్నే లేచి తలంటు పోసుకుంది. దేవుడికి పూజ చేసింది. ఇల్లు కడిగి ముగ్గులు తీర్చింది.



శృతి లేచింది ఇంతలో—

ఏడాదిలో మరింత వళ్లు చేసి— చాలా అందంగా వుంది పాప. ఎప్పుడూ నవ్వుతూ వుండే శృతి అంటే ప్రతి ఒక్కరికీ ముద్దే. తప్పటడుగులు వేస్తూ తండ్రి మంచం దగ్గరికి వెళ్లి జుట్టు పీకింది— లేవంగానే! అప్పుడప్పుడే కొద్దిగా మాటలు వస్తున్నాయి.

"నా... న్నా... నా" అంది ముద్దుగా.

బద్ధకంగా పడుకున్న చరణ్ అమాంతం పాపని ఎత్తుకుని, గుండెలమీద కూర్చోబెట్టు కున్నాడు. బుగ్గలు రెండూ ముద్దు పెట్టు కున్నాడు. తన బుగ్గలు అందించాడు, ముద్దు పెట్టుకోమని! ముద్దు పెట్టునికు గట్టిగా చప్పట్లు కొట్టింది శృతి!

"ఇవాళ ఎవరి పుట్టిన రోజమ్మా?" అడిగాడు గారాబంగా. వారం రోజుల నుంచి ఈ ప్రశ్ననే వింటోంది శృతి— జవాబేం చెప్పాలో బాగా తెలుసు!

చేతో గుండెలమీద చిన్నగా కొట్టు కుంది— నాది అన్నట్టు!

"కాదు. నాది" అన్నాడు చరణ్.

తెలిసినట్టు తల తిప్పింది కాదన్నట్టు!

"అమ్మది" అన్నాడు చరణ్.

నవ్వుతూ మళ్లీ తలతిప్పింది కాదన్నట్టు

"మరెవరిది?"

మళ్లీ తనవైపే చూపించుకుంది!

గాఢంగా గుండెలకు హత్తుకున్నాడు.

అంతలో పల్లవి వచ్చింది అక్కడికి—

"ఇంక చాలుగానీ — లేవండి — తండ్రీ కూతురూ."

## రాగలహరి

"అప్పుడే దేవిగారు రెడీ అయిపోయారే."

"తెల్లవారింది— పరసాలకి ?" ముద్దుగా విసుక్కుంది.

"ఏమిటి నీ తొందర ? కాసేపు మా అమ్మాయితో ఆడుకోనివ్వవా ?"

"ఇప్పుడేం ఆటలు ? అవతల చెయ్యవలసినవి చాలా వున్నాయి." పాపని ఎత్తుకుని లోపలికి వెళ్లింది పల్లవి.

బ్రెష్ మీద పేస్టు వేసి చరణ్‌కి అందించింది. పాప పుట్టినా చరణ్‌ని నిర్లక్ష్యం చెయ్యలేదు పల్లవి. అతన్నీ ఒక పాపలాగానే చూసుకుంటోంది. పాపకి పాలు కలిపిఇచ్చింది. ఏడాదిలోపలే పాపకి సీసాపాలు మానిపించి— గ్లాసుతో పాలు పట్టడం అలవాటు చేసింది పల్లవి. చరణ్‌కి కాఫీ అందించి తర్వాత పాపని స్నానానికి తీసుకువెళ్లింది. మంగళ హారతి పాడుతూ నూనే, నలుగూ పెట్టింది. తలంటి పోసింది. పాప అల్లరి చేస్తున్నా, కబుర్లు చెబుతూ, తలంటు పూర్తిచేసింది. సాంబ్రాణీ పొగవేసి, వళ్లంతా పౌడరు రాసింది.

ఆ క్రితం రోజు, చాలా షాపులు తిరిగి సెలెక్ట్ చేసిన గులాబీరంగు నైలెక్స్ గౌను తొడిగింది. కళ్లకు కాటుక, నుదుట బొట్టూ పెట్టింది. "దేముడి" దగ్గరికి తీసుకువెళ్లి దణ్ణం పెట్టించింది. తరవాత తండ్రికి దణ్ణం పెట్టమంది.

ఎంతో అందంగా— ముద్దుగా వున్న కూతుర్ని చూసుకుని మురిసి పోయాడు. చూడడానికి రెండు కళ్లు చాలవనిపించింది చరణ్‌కి.

"హాపీ బర్త్ డే టూ యూ" అంటూ ఎత్తుకుని ముద్దుల వర్షం కురిపించాడు.

అందరూ స్వీట్లు తిన్నాక, పనిమనిషితో సహా! ఆనక వంట ప్రయత్నంలో పడింది పల్లవి. ఎన్నో పదార్థాలు తయారుచేసింది.

పల్లవి వంట చేస్తున్నంతసేపు శృతిని తనే చూసుకున్నాడు చరణ్. శృతిని ఎత్తుకుని ముందు అన్నం తినిపించింది— పల్లవి పాటలు పాడుతూ. చేసినవన్నీ కొద్ది కొద్దిగా తినిపించింది.

ఆ తరువాత ఇద్దరూ కలసి కూర్చుని భోజనం చేశారు పల్లవీ, చరణ్

"అప్పుడే సంవత్సరమైందా శృతి పుట్టి? నిన్న మొన్న పుట్టినట్టుంది కదూ?" అన్నాడు చరణ్.

నవ్వింది పల్లవి!

ఆ సాయంత్రం పేరంటానికి పిల్చింది— చాలా మందిని పల్లవి.

మధ్యాహ్నం కాసేపన్నా పడుకోకుండానే ఆ ఏర్పాట్లు చూస్తూ కూచుంది పల్లవి. పాపని మాత్రం నిద్రబుచ్చింది.

సాయంత్రం నాలుగవుతుండగా— పాపను లేపి పాలుపట్టి, మొహం కడిగింది. తరువాత నీలం కంచిపట్టు పరికిణీ కట్టింది, దానికి సింధూరం రంగు బార్డర్— అదే లాంటి బ్లౌజు వేసింది!

కాళ్లకి గజ్జెలు, చేతికి బంగారం గాజులు, మెళ్లో ముత్యాల నెక్లేసు, చెవులకి జూకాలు పెట్టింది.

అందంగా మెరిసిపోతున్న కూతుర్ని తనివి దీరా ముద్దు పెట్టుకుంది. తనుకూడా తెల్లని పట్టుచీర, జాకెట్టుతో ముస్తాబయింది. వాటికి మేచైన నగలు వేసుకుంది. జుట్టు పైకి దువ్వి ఎత్తుగా ముడి వేసుకుంది.

అన్నీ సర్ది అరేంజ్ చేసింది.

పాపని కూర్చోబెట్టవలసిన కుర్చీని పూలతో బాగా అలంకరించింది. ఆ గదిలో అగరొత్తులు వెలిగించింది. ఒక పళ్లెంలో వెండికుంకుమ భరిణె, పసుపు, గంధం గిన్నెలు వుంచింది. మరో చిన్న ప్లేటులో అక్షింతలు, హారతివ్వ డానికి వెండి కుందులలో వత్తులు వేసి వుంచింది. ఒక పెద్ద గంపలో ఒక పక్కగా ఇవ్వవలసిన కవర్లు రెడీగా వుంచింది.

ఐదవుతుండగా వచ్చాడు చరణ్.



## ఉత్తమమైన పౌడర్లు ఖరీదైనవి
## మరియు చౌక పౌడర్లు తేలిక రకాలు

# కాని
# స్వస్తిక్ ఉతికే పౌడర్
# అన్నిటికన్నా విభిన్నమైనది




2 కిలోలు,
1 కిలో,
500 గ్రాములు
మరియు
200 గ్రాములు
క్రొత్త పోలిప్యాక్‌లో

స్వస్తిక్ ఉతికే పౌడర్ అన్నిటికన్నా విభిన్నమైనది ఎందుకంటే దీనిలో మితవ్యయము ఉత్తమము అపురూపముగా కలిసినవి. అంటే ఇది చౌక మరియు ఉత్తమమైనది!

సీలి

డిటర్జెంట్ ఉతికే పౌడర్

Sh/p-D 24/80

## రాగలహరి

"అబ్బ... నా బంగారు తల్లి... ఎంత బావుందీ..." వస్తూనే ఎత్తుకున్నాడు పాపని.

"పల్లవీ... శుభవార్త... ఇట్లారా... తొందరగా ... పంచదార తీసుకొనిరా ... త్వరగా రావాలి మరీ..."

పాపని ఎత్తుకునే వంటింటి వైపు వెళ్ళాడు. అప్పటికే కాఫీ ఫలహారాలతో వస్తోంది పల్లవి.

ఎదురుగా వచ్చి ఇంకోచేత్తో చుట్టేశాడు పల్లవిని. అతడికి అతి సమీపంగా వచ్చిన పల్లవి చెవిలో "శుభవార్తేయ్. ప్రమోషన్ వచ్చింది మనకి..." అన్నాడు.

"నిజంగానా... వుండండి..." అంటూ విడిపించుకుని ప్లేట్లో వున్న లడ్డూని తీసి అతడి నోట్లో పెట్టింది పల్లవి. అదే లడ్డుని సగం కొరికి మళ్ళీ పల్లవి నోట్లో పెట్టాడు చరణ్. అది చూచి పాప నోరు తెరిచింది. "నీకా– ఉందు..." అంటూ జేబులోంచి కాడ్‌బరీ చాక్‌లెట్ తీసి పేపర్ వూడదీసి పాప నోట్లో పెట్టాడు చరణ్.

"అబ్బ! ఇవాళెంత మంచి రోజు. అంతా మన శృతి పుట్టిన వేళావిశేషం" దేవుడికి దణ్ణం పెట్టింది పల్లవి.

"ఇప్పుడు పేరంటాళ్ళు వస్తారా? నన్ను బయటికి వెళ్ళమంటావా– హతోస్మి."అన్నాడు చరణ్.

"ఇప్పుడే కాదులెండి, మరో అరగంట అయ్యాక..." అంది పల్లవి.

కాఫీ– ఫలహారాలయ్యాక మొహం, కాళ్ళు చేతులు కడుక్కుని, బట్టలు మార్చి, బయటికి వెళ్ళాడు చరణ్ అట్లా తిరిగొస్తానని.

మరి కాస్సేపటికి పేరంటాళ్ళంతా వచ్చారు. అందర్నీ చిరునవ్వుతో ఎదురెళ్ళి ఆహ్వానించింది పల్లవి.

ఆ తరువాత పాపని కుర్చీలో కూచోబెట్టి హారతిచ్చింది. మరో నలుగురు ముత్తయిదువలు పట్టుకున్నారు పళ్ళాన్ని. ఇద్దరు ముగ్గురు పాటలు పాడారు.

అందరూ అక్షింతలు జల్లి దీవించారు పాపని.

అందరికీ బొట్టు, పసుపు, గంధం ఇచ్చి కవర్లు అందించింది. ఆ కవర్లలో పండు– తాంబూలం – ఒక స్వీట్ పాకెట్ – హాట్




బులుసు వేంకట రమణయ్య

## స్వభావో దురతిక్రమః

స్వభావాన్ని మార్చుకోవడం దుస్సాధ్యమని అభిజ్ఞుల అభిప్రాయం. దుష్ట స్వభావాన్ని మార్చడం కష్టసాధ్యం కాని సత్స్వభావం సులభంగా దుఃస్వభావంగా మార్పిడి చెందవచ్చు. ఎన్ని కష్టాలనయినా సహించి, శ్రమలకు ఓర్చి ఉత్తములు తమ సత్‌స్వభావాన్ని నిలుపుకొంటారు. శ్రీ భగవాన్ సత్య సాయిబాబా ప్రసంగవశాత్తు చెప్పిన ఒక చిన్న కథ ఈ విషయాన్ని ప్రబోధిస్తున్నది.

శాంతమూర్తి, ఉత్తమ స్వభావుడు అయిన ఒక యోగి గంగానదిలో స్నానం చెయ్యడానికి వెళ్ళాడు. ఆయన స్నానంచేస్తూ ఉండగా, ఒక తేలు నీటిమీద తేలుతూ, ప్రాణ రక్షణకోసం గిలగిల కొట్టుకొంటూ ఉండడం ఆయన చూచి, దయతలచి, వెంటనే దాన్ని రక్షించడానికి చేతిలోకి తీసుకున్నాడు. ప్రాణాపాయం తప్పిన ఆ తేలు అతని అరచేతిని తక్షణమే కుట్టింది. ఆ బాధవల్ల అతడు వెంటనే నీళలో పడవేశాడు. కాని, మరు క్షణంలోనే దానిమీద జాలి కలిగి మళ్ళీ దానిని చేతిలోకి తీసుకున్నాడు. ఆ తేలు మళ్ళీ అతన్ని కుట్టింది. అతనికి తేలు కుట్టిన బాధ ఇనుమడించింది. అందువల్ల మళ్ళీ దాన్ని నీటిలో జారవిడిచాడు. కాని మరుచటి క్షణంలోనే మళ్ళీ అది చచ్చిపోతుందేమో! అని కరుణ కలిగి, తిరిగి చేతిలోకి తీసుకున్నాడు. కృతజ్ఞతలేని ఆ తేలు ఆ యోగిని మూడవసారి కూడా కుట్టింది. ఈసారి విపరీతమైన ఆ బాధను భరిస్తూనే గబగబ ఒడ్డుకు వచ్చి నేల మీద ఆ తేలును పడవేశాడు. అది త్వరగా ఎక్కడికో వెళ్ళి పోయింది. దానికి ప్రాణాపాయం తప్పింది.

ఆ నదిలో స్నానం చేస్తున్న కొందరు దీన్ని గమనిస్తూనే ఉన్నారు. వారిలో ఒకడు ఆ యోగిని చూచి "ఇంత తెలివి తక్కువ ఎక్కడయినా వుంటుందా? ఆ తేలును మీరు రక్షించదలచి చేతిలోకి తీసుకున్నప్పుడు అది కుట్టింది గదా! దాన్ని రెండోసారి ఎందుకు కాపాడడానికి యత్నించాలి. ఇలాటి విషప్రాణులకు ఉపకారం చెయ్యకూడదు. వీటికి కృతజ్ఞత వుండదు" అన్నాడు.

"ఈ తేలు నాకు గుణపాఠం బోధించి మేలే చేసింది. కుట్టడం దాని స్వభావం. ఎట్టి పరిస్థితులలోనూ— ఉపకారం జరిగినా, అపకారం జరిగినా— అది తన స్వభావాన్ని మార్చుకోదు. ఆ విధంగానే నేను కూడా నాకు మేలు కలిగినా, కీడు కలిగినా కూడా నా స్వాభావికమైన స్వభావంతో మార్పు రానీయ కూడదు. మొదటిసారి అది కుట్టినపుడు, ఆ తేలును నీటిలో పడవెయ్యటం తగదు. నేను నీటిలో పడవేసినందుకే మళ్ళీ మళ్ళీ నన్ను కుట్టిందని అనుకొంటున్నాను. ఉపకారాపకారాలను, సుఖాన్ని, బాధను లెక్కించకుండా ఇతర ప్రాణులకు ఉపకారమే చెయ్యాలనీ, అవి బాధించినా లెక్కచెయ్య కూడదనీ నేను ఇప్పుడు బాగా గ్రహించ గలిగాను" అని ఆయన సమాధానమిచ్చాడు ★

---

పాకెట్ వేసింది. కవరు మీద శ్రుతి పేరు అచ్చువేయించింది కావాలని. వచ్చిన వాళ్ళందరికీ చరణ్ ప్రమోషన్ గురించి చెప్పింది పల్లవి అందరూ పల్లవి అదృష్టాన్ని పొగిడారు. ఒకప్పుడు వీళ్ళల్లో చాలామంది పల్లవిని ఆక్షేపించిన వారూ వున్నారు! కావాలనే పల్లవి వాళ్ళందరి ఎదుటా గర్వంగా ప్రవర్తిస్తోంది!

పేరంటమయి అందరూ వెళ్ళేటప్పటికి ఎనిమిది అయింది. శ్రుతికి దిష్టి తీసి అప్పుడింక అన్నం తినదని పాలు పట్టింది పల్లవి. బట్టలు మార్చి పడుకోబెట్టింది. పాప నిద్ర పోయిన కాసేపటికి ఇంటికి వచ్చాడు చరణ్. ఆరాత్రి పల్లవీ చరణ్‌లకు మధురమైనరాత్రే అయ్యింది. మరపురానిదైంది!

* * *

ప్రమోషను వచ్చినప్పటినించీ చాలా బిజీ అయిపోయాడు చరణ్. భార్యతో బిడ్డతో ఎక్కువగా కాలం గడపలేక పోతున్నాడు. క్యాంప్స్ ఎక్కువయ్యాయి.

రాత్రిళ్ళు ఆలస్యంగా పడుకోవడం వలన ప్రొద్దున్నే లేవలేకపోతున్నాడు. లేవంగానే కాలకృత్యాలు, స్నానం, భోజనం, ఆఫీసు.

ఈలోపల ఏవేవో ఫైల్సు చూసుకుంటూ వుంటాడు. ఫోన్ కాల్స్ రిసీవ్ చేసుకుంటూ వుంటాడు. ఆఫీసుకి తొందరగా వెళ్ళాలని స్కూటరొకటి కొన్నాడు. కొంటామని తెలిసినప్పటినించీ ఎంతో ఆశగా ఎదురు చూసింది పల్లవి. తామిద్దరూ, శ్రుతీ కలిసి సాయంత్రాలు షికారుకీ, సినిమాలకీ వెళ్ళవచ్చనీ, షాపింగులు చెయ్యవచ్చనీ ఎన్నో కలలు కంది!

కానీ నిరాశే ఎదురైంది ఆమెకి! భర్త సాయంత్రం ఇంటి కొచ్చేటప్పటికే చాలా ఆలస్యమయి పోతోంది.

బాధ్యతలూ, హోదా పెరిగినప్పటినించీ, మరీ తీరిక లేకుండా యాంత్రికమయి పోతుంది మనిషి బతుకు. నిజంగా చిన్న ఉద్యోగాలే హాయేమో! కలో గంజో తాగినా కలిసి బతకచ్చు— అనుకుంటోంది అప్పుడప్పుడూ పల్లవి.

భార్యతో మనసువిప్పి మాట్లాడడానికే టైముండడంలేదు— అతడికి! ఇంటికి వచ్చే పోయేవారి తాకిడి ఎక్కువైంది.

లంచ్‌లూ, డిన్నర్లూ, కాఫీలు, టీలూ అందించడాలూ ఎక్కువైనాయి!

ఇల్లు చాలడంలేదని పెద్ద యింటికి మారారు. పల్లవికి సహాయంగా అని ఇద్దరు పనివాళ్ళు ఏర్పడ్డారు! ఇల్లు అమర్చుకోవడం, సర్దుకోవడం, శ్రుతితో ఆడుకోవడంతో టైము గడపడం నేర్చుకుంది పల్లవి.

(ఇంకా వుంది)

# ఏకకేంద్ర వృత్తాలు




బేహరా వెంకట సుబ్బారావు

"రెండొందలేభై రూపాయిలు!"

మరోకసారి తృప్తిగా అనుకొన్నాడు అపిరయ్య లాల్చీ పక్క జేబునుంచి లెక్కని బయటకు తీసి యింకోసారి లెక్కపెట్టుకొన్నాడు. పెళపెళ్లాడుతున్న ఆ కాగితాల్ని మడిచి తిరిగి జేబులోకి తోసాడు. ఉదయాన్నే లేస్తూ ఎవరి మొహం చూసిందీ గుర్తుకు రాలేదతనికి. ఆ రోజు సంపాదన బావుంది.

అపిరయ్య పశువుల బేరగాడు. అతనుచేసే వ్యాపారానికి పెట్టుబడి అవసరం లేదు. అదృష్టం వుంటే చాలు. దగ్గరలో వున్న తుని, పిఠాపురం, ద్వారపూడి సంతలకి వెళ్తాడు. పశువుల నమ్మేవారు తనుపశువుల్ని అపిరయ్యకు చూపిస్తారు. తాము అమ్మదలచుకొన్న ధర చెబుతారు. అంతకన్నా ఎక్కువ ధర పలికిస్తే ఎక్కువ కమీషన్ ముట్టచెబుతా మంటారు.

పశువుల్ని కొనడానికి వచ్చిన ఆసామీల్ని పసిగట్టి, పనిగట్టుకొని వారిని పలకరిస్తాడు చిరునవ్వుతో ఆహ్వానిస్తాడు. తన జీవితం అటువంటి వారి సేవలకీ, సహాయానికీ అంకితమయినట్లు ప్రవర్తిస్తాడు. కమ్మని కబుర్లు చెప్పి ఆ కట్టుకొంటాడు. ఏ రకం పశువు కావాలో, ఏ ధరలో కావాలో వివిరంగా తెలుసుకొంటాడు. వారికి పశువును చూపించి దాని అంగాంగ వర్ణన చేస్తాడు. ఎక్కడెక్కడ సుడులున్నాయో చూపించి, వాటి వలన యజమానికి కలుగబోయే లాభాలను ఏకరువు పెడ్తాడు. ఆ పశువుకున్న యితర శుభ లక్షణాలన్నింటినీ వర్ణిస్తాడు. చాకచక్యంగా కబుర్లు చెప్పి వారిని వొప్పించి వచ్చిందని పిస్తాడు.

ఆ తర్వాత తన విద్యను ప్రదర్శిస్తాడు. కొనేవారిని అమ్మేవారి నుండి మాటలు వినిపించనంత దూరానికి తీసుకొని వెళ్లి దాని ధర చెబుతాడు. ధర విన్నాక కొనేవాడు మూర్ఛపోకుండా, ముందుగా మరోకసారి ఆ పశువుకున్న శుభలక్షణాలన్నింటినీ వర్ణిస్తాడు. దాని జాతి విశిష్టతను వివరిస్తాడు అలాంటి పశువుని తీసుకెళ్లి తమ పాకలో కడితే చాలు! ఐశ్వర్యంపాలు పొంగినట్లు పొంగుతుందంటాడు. అటువంటి మేలైన జాతి పశువును కొనేశక్తి అవకాశమూ వారిలాంటి వారికే తప్ప యితరుల కుండదని ఢంకా వాయించి చెబుతాడు. బేరంచేసి ధర తగ్గించడానికి ప్రయత్నం చేస్తానని వాగ్దానం చేస్తాడు. నేర్పుగా వారిచే "ఊఁ" అనిపిస్తాడు. వారిని అక్కడనే వదలి ఆ తర్వాత పశువు యజమానిని కలుస్తాడు. వారు అనుకొన్నంత ధర రావడం కష్టం అంటాడు. అంతకన్నా

జాతయిన పశువులకే ధర పలకడంలేదని చెప్పి, యింకా ఆలోచిస్తే ఆపాటి ధర కూడా రావడం కష్టం అని పిరికి మాత్ర వేస్తాడు. అధైర్యం నూరిపోస్తాడు. వారెలాగూ కొనే వుద్దేశ్యంలో వున్నారు కాబట్టి కొంత గాక కొంతైనా ధర పెరిగేలా చూస్తానని ప్రామిస్ చేస్తాడు. ఏదో ధరకి సెటిల్ చేస్తాడు. వారిరువురూ సంతోషంగా వాడి సేవలకి యిచ్చిన ప్రతిఫలాన్ని అందుకొంటాడు.

ఆరోజు పెద్ద బేరమే తగిలింది. జర్సీ పడ్డని మూడువేలకి సెటిల్ చేసాడు. ప్రతిఫలంగా రెండువందల యాభై రూపాయలు ముట్టాయ్. అతని కళ్లు ఆనందంతో మెరిసిపోతున్నాయ్. ఎదురుగా కల్లుపాక ఆహ్వానిస్తోంది. మూడురూపాయలు బాకీ పడినందుకు గతవారం కల్లుపాక యజమానురాలు సింహాచలం చేత ఎన్నో తిట్లు కాయాల్సి వచ్చింది. "ఆ మూడ్రూపాయలూ దాని మొహంమీద విసిరికొడ్తా!" అనుకొంటూ అసిరయ్య అడుగులు వేయబోతూ వుంటే పలకరించాడు నర్సింహులు.

"ఏటి మావా ! యియ్యేల చాలా వుసారుగున్నావే ! పెద్ద బేరమేమైనా తగిలిందేటి?"

కళ్లతోనే నవ్వేసాడు అసిరయ్య. అవునన్నట్లు తలూపాడు.

"మరయితే యియ్యేల యింటికి రావన్నమాట ! మండపేట మాలచ్చిమి కాడికి పోతావు కాబోలు !"

అంటూ నర్సింహులు అసిరయ్యను సమీపించి ఆశగా చూసాడు.

"ఎల్లాలనే వుందిరా నర్సిగా ! గానీ యింటికాడ మీ యత్తకి జొరంగుంది. రా ! సింహాచలం కొట్లో కెళ్లి రెండు సీసాలు యేసుకొందాం !" ఆహ్వానించి అడుగులు వేయసాగాడు అసిరయ్య.

"మాయావ సానా మంచోడు !" అనేసి అసిరయ్యను అనుసరించాడు నర్సింహులు. అసిరయ్యతో చాలా పనుంది నర్సింహులుకి.

కొంతసేపటికి కల్లుపాక నుంచి బయట పడ్డారు యిద్దరూ. అసిరయ్య చెప్పిన విషయాలు జాగ్రత్తగావిన్నాడు నర్సింహులు.

"నే యెల్తా మావా! అర్జంటుపనుంది!" అనేసి గబగబా అడుగులు వేయబోయాడు నర్సింహులు.

"ఒరే నర్సిగా !" పిల్చాడు అసిరయ్య.

"ఏటి మావా !" ఆగి వెనక్కు తిరిగి అడిగాడు నర్సింహులు.

"ఇంటికేనా ఎల్తున్నావ్ ?" ముద్దుగా అడిగాడు.

"ఏమో మావా ! ఎక్కడికెల్తానో నాకే తెల్దు !"

మౌనంగా వుండిపోయాడు అసిరయ్య.

"నువ్వింటికెళ్లవేటి మావా ? అత్తకి జొరంగుందన్నావ్"

"అందుకేరా యింటికెళ్లాలని లేదు. జొరంతో తొంగుంటే వన్నేటి సూత్తాది సెప్పు ! మండపేట మాలచ్చిమి కాడకి పోనా అనుకొంటున్నారా !"

అసిరయ్య మాటలకి కిసుక్కున నవ్వాడు నర్సింహులు.

"సేతిలో పదిరూపాయలుంటేనే పెళ్లాం దగ్గరి కెళ్లవ్ ! నాకు తెల్దేటి మావా నీ సంగతి! ఇయ్యాల రాత్రి మాలచ్చిమి అత్తతో మజా సేత్తావ్ మండపేటలో."

తన రసికత్వాన్ని వాడు మెచ్చుకుంటూంటే పొంగిపోయాడు అసిరయ్య.

* * *

ఇరవై సంవత్సరాల వయస్సు దాటిన నర్సింహులు జీవితం తెగిన గాలిపటం



లాంటిది. పదహారో ఏటనే యిల్లు వదిలి పెట్టి దేశాలు పట్టాడు. వాడి స్వగ్రామం శ్రీకాకుళం జిల్లాలో ఓ పల్లెటూరు. అక్కడ తల్లీ తండ్రీ వున్నా వారికోసం ఎన్నడూ బాధ పడడు, వారు కూడా తనయుణ్ణి గురించి పట్టించుకోరు. దారిద్ర్యం భరించలేక యిల్లు వదిలి పారిపోయాడు. చాలావూళ్ళు తిరిగాడు. విన్నోరకాల కూలిపనులు చేసాడు.

"కష్టపడినవాడికి ఈ కాలంలో కడుపు నిండా తిండి వుండదు. సులువుగా డబ్బు సంపాదించి రాజాలా బతికే మార్గం చూసుకొందాం!" అని స్నేహితుడు పదే పదే చేసిన హితబోధనకు ప్రభావితుడయ్యాడు. వాడితో చేతులు కలిపాడు. ధనాన్ని సులువుగా సంపాదించే మార్గాన్ని అవలంభించాడు. పోలీసుల దృష్టి తనమీద ఎప్పుడూ వుంటుంది. చాకచక్యంగా తప్పించుకొంటాడు. రెండుసార్లు జైలుకెళ్ళాడు. అయినా అతనికి విచారంలేదు. "బయట వున్నంత కాలమూ రాజాలా బతుకుతున్నాన"ని సంతోషిస్తాడు.

* * *

హెడ్డు వెంకటస్వామి అంటే ఆసర్కిల్లో అందరికీతెల్సు. పంథొమ్మిదోయేట సర్వీసులో ప్రవేశించి ముప్పయేళ్ల సర్వీసు పూర్తి చేసాడు. అయినా హెడ్‌కానిస్టేబులు హోదాకి మించి ఎదగలేకపోయాడు. చదువూ తెలివితేటలూ వున్నా ప్రమోషన్ పొందే అదృష్టం మాత్రం లేదు. అతని తర్వాత సర్వీసులో జాయిన్ అయినవాళ్లు చాలామంది సర్కిల్ యినస్పెక్టర్లు కూడా అయ్యారు. వుద్యోగంలో హోదా పెంచుకోలేకపోయినా ఆస్తి పాస్తుల్ని మాత్రం బాగా పెంచు కొన్నాడు. ఇప్పుడు ప్రమోషన్ రాలేదన్న చింత అతనికి లేదు. ఆస్తిని పెంచుకోవడమే అతని జీవితాశయం. ఆఫీసర్లని మంచి చేసుకొని ఆసర్కిల్లోనే చాలా సంవత్సరాలుగా వుంటున్నాడు.

అతని దృష్టిలో అతని భార్య వెర్రి బాగుల్ది. కాకపోతే సిరిరా మోకాలొడ్డుతుందా?

"మనకొద్దు మావా ఈ అన్యాయపు ఆర్జన! ఈ పాపిష్టి సొమ్ముతో మనం సుఖపడలేం. డబ్బిచ్చేవాళ్ళు మనల్ని ఎంతగానో శపిస్తారు. ఆ శాపాలు మనకి తగుల్తున్నాయ్. చిన్నోడు అవిటోడయిపోయాడు. పెళ్లయిన పిల్ల ఆర్నెల్లకే పసుపు కుంకుమ చెరుపుకుని యింటికి తిరిగొచ్చింది. అమాయకుల నోళ్ళు కొట్టకు మావా! దొంగ యెదవలకి సాయం చేయకు మావా!"

అని రోజు కొకసారయినా నెత్తీ నోరూ మొత్తుకొంటుంది. పెళ్ళాం ఏడుపు వెంకటస్వామికి అలవాటయిపోయింది. కాబట్టి ఏమీ పట్టించుకోడు. అయినా ఎప్పుడయినా తీరిగ్గా వున్నప్పుడు ఆలోచిస్తూ వుంటాడు.

"చిన్నవాడికి పోలియో రావడానికీ, జబ్బు చేసి అల్లుడు చనిపోవడానికీ, తన ఆర్జనకి ఏవిటి సంబంధం? బాగా ఆర్జించాను కాబట్టే, రాయివెల్లూరు హాస్పిటలుకి తీసుకెళ్ళి పదివేలు తగలేసి పెద్ద వైద్యం చేయించాను. వాడి దురదృష్టం! కాలు నయం కాలేదు. పదివేలు కట్నంపోసి, పెద్ద ఉద్యోగస్తుడికి కూతుర్నిచ్చి పెళ్లి చేసాను. అల్పాయుష్మంతుడని ఎవరికి తెలుసు! భర్తలేదన్న లోటు తప్పించి ఆమెకు ఏ లోటూ వుండకూడదు... దాని బతుకు అది బతకాలి... అందుకే దానిని కాకినాడ కాలేజీలో చేర్పించాను. పెద్దవాడు అదృష్టవంతుడు కాబట్టి విశాఖపట్నంలో డాక్టరీ చదువుతున్నాడు. ఈ రోజుల్లో డాక్టరీ చదివించడమంటే మాటలా? డబ్బుని ఎలా సంపాదించినా దాని విలువ దానికుంది. ఉద్యోగంలో ఎలాగూ పైమెట్టెక్కలేను. ముసలితనంలో ఆదుకోడానికి గడించిన డబ్బయినా వుండాలి, అందొచ్చిన కొడుకులైనా వుండాలి. ఈ రోజుల్లో కొడుకుల్ని నమ్మలేం! పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు చెప్పించాం కాబట్టి ఆఖరి దశలో ఆదుకుంటారని ఆశించడం వట్టి అవివేకమే అవుతుంది. కాబట్టి ధనాన్ని ఆర్జించాలి.

"అప్పారావు మావూరివాడే. నా తర్వాత నాలుగేళ్ళకి సర్వీసులో జాయిన్ అయాడు. నిప్పులాంటి మనిషి బహు తెలివైనవాడు. ప్రమోషన్లు బాగా వచ్చాయ్. సర్కిలిన స్పెక్టర్ అయాడు అతను నమ్ముకొన్న నీతి, నిజాయితీలే అతన్ని వెన్నుపోటు పొడిచాయి. ఉద్యోగ ధర్మం అంటూ పెద్దవారితో పేచీకి దిగాడు. కొండతో గొర్రె ఢీకొన్నట్లయింది. ప్రమోషన్ రాలేదు సరికదా ఉన్న ఉద్యోగం ఊడింది. నాలుగేళ్ళు నానా కష్టాలూ పడి షుగర్ ఫేక్టరీలో పని సంపాదించు కొన్నాడు. కాలం వెళ్లబుచ్చు తున్నాడు. తెలివైన వాణ్ణి కాబట్టి ప్రమోషన్లు రాకపోయినా దీపం వుండగానే యిల్లు చక్కదిద్దుకొంటున్నా. రెండుచేతులా ఆర్జించుకొంటున్నా."

ఇలా వుంటుంది అతని ఆలోచనా సరళి.

అయితే ఆర్నెల్ల క్రిందట అతని అరచేతిలో ముల్లు గుచ్చుకొంది. ఆరు నెల్ల క్రితం కొత్తగా ఎస్సయ్‌గారు వచ్చారు ఆ స్టేషనుకి. డైరక్టు రిక్రూటీ! ట్రెయినింగ్‌లో చెప్పిన పాఠాలు యింకా మర్చిపోలేదు. యువక రక్తం కాబట్టి నీతి — నిజాయితీ అంటూ వుంటాడు. వెంకటస్వామి దృష్టిలో ఆ ఎస్సయ్ ఒక కుర్రకుంక. తన సర్వీసంత వయసు లేదతనికి.

గత సంవత్సరంలో, అతని నడవడికీ సేవలకీ మెచ్చి బంగారు పతకం బహూకరించింది ప్రభుత్వం. అప్పటి నుంచీ అతను మరీ నిప్పులా కణ కణ లాడుతున్నాడు. అతనికి ఎదురుగా నిలబడాలంటే భయం పుట్టుకొస్తుంది వెంకటస్వామికి. ఎస్సయిగారికి బహుమతి లభించిన సందర్భాన్ని పురస్కరించుకొని ఆ స్టేషన్ స్టాఫంతా కల్సి వారికి సన్మాన సభ యేర్పాటు చేసారు. పెద్ద

## కృత్రిమ బంగారం!

కృత్రిమ పద్ధతుల ద్వారా బంగారం తయారు చేయడమనేది చాలా ప్రాచీనమైన కోరిక. సైన్సు తొలిరోజుల్లో సాధించిన ప్రగతికి కారణం కూడా యీ కోరికే. పశ్చిమ జర్మనీలో శాస్త్రవేత్తలు జరుపుతున్న ప్రయోగాలలో అనుకోకుండా దీనిని సాధించ కలిగారు.

ఈ ప్రయోగాలలో రాగి పరమాణువులను తగరపు అయానులతో ఛేదించడం ద్వారా బంగారం తయారుచేయడం సాధ్యమైంది. ఈ ప్రయోగంలో చాలా చిన్న మొత్తంలో మాత్రమే బంగారం తయారయింది. అది కూడా రేడియో ధార్మికత వలన నిమిషాలలోనే నాశనమైంది. ఈ ప్రయోగానికి మూడు గంటల సేపు పట్టింది. ఈ విధానాన్ని అభివృద్ధిచేసి ధనసంపాదించే ఆలోచన ఈ శాస్త్రజ్ఞులకు లేదు. వారు చేపట్టిన పరిశోధనా కార్యక్రమంలో యిది ఒక ఉపవస్తువుగా తయారయింది.

(గ్లోబల్)

డాక్టరుగారూ! మా బొమ్మ
పాపాయికి వంట్లో
బాగాలేదు. కొంచెం చెక్ చేసి
చెప్పండి సార్.

జ్వరంలాంటిదేం కాదు.
కడుపులో నే ట్రబుల్.
ఉడవర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇది వర్షాకాలం
కదా డాక్టర్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్
వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా
చలికాలమైనా ఏ కాలమైనా సరే,
పిల్లలకు కడుపులో ఎలాంటి ట్రబుల్
వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి.






**100** ఏళ్లుగా మాతృలోకం
విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS/OPPL/3/80/TEL

# వారఫలం

**19-12-1980 శుక్రవారం మొదలు**

**25-12-1980 గురువారం వరకు**

మేషం : ఏవిధంగా చూచినా యోగదాయక మైన వారమే. గురు, శనుల యుతి ఒకవిధంగా ధనాదాయానికి, అప్రయత్న ధన లబ్ధికి దారి తీయగలదు. ఎంత ప్రయత్నించినా శత్రు బాధ వదలేమార్గం కానరాదు. ఉద్యోగ వృత్తులు అభివృద్ధిదాయకములే. స్త్రీలకు శుభ కార్య ప్రస్తావనలు, నూతనోద్యోగావకాశము లుండగల వని చెప్పవచ్చు.

వృషభం : పంచమరాశి స్థితుడైన గురు గ్రహం, శుభదాయకంగా ఉండగలడు. కాని శని ఏమాత్రం, మంచి కార్యాలు జరిపేటందులకు దోహదం చేయజాలడు. వ్యాపారంలో ఆశింప దగినది సామాన్య ఫలితమే. స్త్రీలకు విద్యా వినోద కార్యక్రమంతో వారం గడచిపోతుంది. లబ్ధిగల వారమే.

మిథునం : నగలు కొనగల్గటం, క్రీడా రంగంలో అధికావకాశాలు వినియోగించుకోవటం, నూతన వస్తు సేకరణ చేయటం, ఉద్యోగంలో ప్రగతి సాధించటం ఈ వార ఫలం. వ్యాపారంలో చాలమందికి, అలవాటుగల వారికి అనుకూల వారంగా గ్రహించాలి. స్త్రీలకు : కళారంగంలో ఖ్యాతి, ఉద్యోగంలో ప్రఖ్యాతి లభించగలవారం.

కర్కాటకం : మీకు వ్యాపార లాభం చెప్ప దగినవారం. నూతనోద్యోగ ప్రాప్తి చాలమందికి కలదని చెప్పదగినవారం. సభా గౌరవం, సన్మాన కార్యక్రమంలో మీకు అనుకూల సంప్రాప్తి సంభవింపనున్నది. రాజకీయంగా, ఆర్థికంగా మీకు బాగున్నదనే చెప్పవలె. స్త్రీలకు : అన్ని రంగాలలో అభివృద్ధి సామాన్యం.

సింహం : అనుకోకుండా ఆరోగ్యలోపం కనిపించగలదు. అజీర్ణమో, రక్తపుపోటు బెడ దయో కనిపించగలదు. ఇంట అశాంతి ప్రబలే అవకాశమున్నది. రాజకీయంగా బాగుండే వారం గాదు. స్త్రీలకు మిశ్రమ వార ఫలమే. ఉద్యో గస్థులు జాగరూకతగా సంచరింపవలసినవారం.

కన్య : అనుకోకుండా అధికారులవలన మాట పడటమో ! వస్తువులు పోగొట్టుకొనుటో, రోడ్డు ప్రమాదానికి గురి కావటమో చెప్ప వలసియున్నది. జాగ్రత్త ! వృత్తి ఉద్యోగాలలో సామాన్య ఫలితమే. స్త్రీలకు : ఇరుగు పొరుగు గొడవలు, వృత్తిలో ఆశించినఫలం అందక పోవటం చెప్పదగినవారం.

తుల : వ్యాపారంలో ద్రోహం చేయగల వారుంటారని చెప్పదగియున్నది. అధికారుల బెడద పొడసూపనున్నది. వృత్తి సాఫీగా జరుగు టకు వీలులేనివారం. త్వరపడి చేసిన కార్యాచరణ మును గూర్చి పశ్చాత్తాపపడగలరు. స్త్రీలకు కుటుంబ భారం, అధిక వ్యయం, సుఖశాంతులు లోపింపగలవు.

వృశ్చికం : వెనుకచేసిన ఒకటి రెండు తప్పి దములవలన ద్రవ్యలోపం కనిపిస్తుంది. నూతన వ్యాపారాన్ని గూర్చి కొందరు మిమ్ముల ప్రేరే పింపనున్నారు. వారు స్తోత్రప్రియులే. అను కోకుండా బంధువుల ఉత్తరాలవలన గ్రహించిన ముఖ్య విషయాలను గూర్చి ఆలోచింపవలసి వస్తుంది. స్త్రీలకు : ఉద్యోగంలో, క్రీడా రంగంలో అప్రయత్నావకాశాలు లభింపగలవు.

ధనుస్సు : మీరు చేసిన వ్యాపారం లాభ దాయకం. వృత్తిలో మీకు ప్రగతి కనిపించ గలదు. మీ ఆలోచనలు వ్యవహార రంగంలో ఫలింపనున్నవి. పాతబాకీలు వసూలయ్యే మార్గ ముంటుంది. గౌరవ పదవి లభించే అవకాశ మున్నది. స్త్రీలు, నగలు కొనటం, బంధు గోష్ఠిలో కాలం వ్యయించటం, ప్రయాణం సంభవించటం చెప్పదగిన విషయాలు.

మకరం : ఆర్థికంగా బాగుండేవారం. మిత్ర సహాయం, అధికారుల ఆదరణ లభింపగలవారం. దూర ప్రయాణం గావించవలసిన అవసరం ఏర్పడగలదు. బహుశః అది శుభ కార్య నిమి త్తమో, వ్యాపార నిమిత్తమో, కావచ్చు. స్త్రీలకు ధన లబ్ధి, కళారంగంలో అవ కాశాలు, క్రీడారంగంలో చొరవగలవారం.

కుంభం : నూతన వ్యాపారం ఆరంభించే అవకాశమున్నది. మిత్ర సహాయం లభించే వారం. రచయితలకు, లాయర్లకు అనుకూల మైనవారం. క్రీడారంగంలో కొందరకు నూత నావకాశాలు లభింపనున్నది. శత్రువర్గీయులు తలలు వంచగలరు. పోయిన వస్తువులు లభించగలవను వార్తవింటారు. స్త్రీలకు ఉద్యోగవృత్తులు బాగుంటాయి. లబ్ధిగలవారం.

మీనం : మిత్రులతో వివాదములు రాగ లవు. బంధువులతో ఒకానొక విషయాన్ని గూర్చి ఘర్షణపడవలసి రావచ్చు. కాన, సంభాషణలో జాగ్రత్త వహించుట మేలు. క్రొత్త విష యాలు తెలిసికోగలరు. ఆరోగ్యం లోపించ వచ్చు. స్త్రీలకు ప్రయాణం చేయవలసి రావటం, వృత్తిలో ఆదాయం, నగలు కొనే అవకాశం గలవారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## మనవి

**ఉత్తరాలు రాసేవారు**

* పూర్తిగా తెలుగు లిపిలోనే రాయాలని,

* వారి పేరు, పూర్తి చిరునామా కూడా రాయాలని,

* మనవి చేసుకుంటున్నాము.

— సంపాదకుడు

ఆ వీధిలోనే ఉన్న తెలుగు మాష్టారి అమ్మాయి తోనూ, నాయుడుగారి అమ్మాయితోనూ కబుర్లకి వెళ్ళేది. లేదా వాళ్ళే తన ఇంటికి వచ్చేవారు. గవ్వలూ, చింత పిక్కలతోటీ ఎన్నో ఆటలు ఆడుకొనేవారు — ఏదేనా మంచి సినిమా వస్తే ఆడపిల్లలంతా గుంపుగా వెళ్ళి చూసి వచ్చేవారు.

ఏదేమయినా, చంపాకి జీవితం ఇదివరకటిలా లేదనిపించింది.

అంతామారి పోయింది! ఇప్పుడు ఇస్త్రీ బట్టలు కట్టుకొని వీధంట నడుస్తూ ఉంటే అందరి కళ్ళూ తనమీదే ఉన్నట్టనిపించేది.

ఇదివరకైతే, అన్ని దిక్కులా చూస్తూ, మనుష్యులని గమనిస్తూ, తను ఎరిగున్న అబ్బాయిలని పలకరిస్తూ వెళ్ళేది. ఇప్పుడేమో తలని ఇటూ అటూ తిప్పకుండా, ఎదురుగా చూస్తూ నడిచిపోయి, అలానే తిరిగి రావాలి!

కాని అందరు ఆడపిల్లలూ ఇలా ఉండడంలేదే? తమ వీధిలోనే తాటికమ్మల పాకల్లో ఉన్న పాలు అమ్ముకొనే రంగమ్మ కూతురు తన కన్నా పెద్దది, పెళ్ళి కానిది. ఎంతో స్వేచ్ఛగా తిరుగుతుందది. తనకి తెలిసిన కుర్రాళ్ళు ఎదురైతే వాళ్ళని పలకరిస్తుంది తనకి బాగా తెలిసిన అబ్బాయిలు పరాచికాలాడుతే వారికి అలానే జవాబిస్తుంది — హాస్యంగా తిడుతుంది — మెట్రిక్ పాసవాలి, బి. ఏ పాసవాలి అన్న నిబంధనేమీ ఆమెకి లేదు — ఆరో క్లాస్ వరకూ చదివి మానేసింది.

ఈ సంగతే ఒకసారి నాన్నని అడిగింది చంప.. నాన్న ఏమన్నారంటే ... "చంపా! ఆ పిల్ల అలా ఉన్నా ఎవరూ తప్పు పట్టరు. మనకీకులాలొకటి వచ్చి పడ్డాయి కద? ఒక్కొక్క కులం వాళ్ళకొక్క రకం నడవడి, ఆచారవ్యవహారాలూ. ఆనాటివి ఎన్ని మార్పులువచ్చినా పోలేదు — కొందరిలో ఘోషా పద్ధతి ఉంటే, కొందరు హాయిగా తిరుగుతారు — కొందరిలో ఎన్నోపనులు తప్పులుగా పరిగణించబడవు మనలో అవి తప్పులుగా పరిగణించబడతాయి. మనలో కన్న రంగమ్మ కులంలో ఆడదానికెక్కువ స్వేచ్ఛ ఉంది. ఆడ, మగ సమానంగా కష్టపడి పని చేస్తారు. కూరగాయలూ, పాలూ, పళ్ళూ మార్కెట్లకి తీసుకవెళ్ళి అమ్ముతారు. వాళ్ళలో పెళ్ళికాని ఆడది భయం లేకుండా ఒంటరిగా ఎక్కడి




(గత సంచిక తరువాయి)

కన్నా వెళ్ళి రాగలదు. ఎవడన్నా మగాడు తప్పుడుగా వ్యవహరిస్తే రోడ్డుమీదనే నిలబెట్టి వాడిని తిట్టగలదు. వాడి చెంప పగలకొట్టగలదు. ఇవన్నీ మనకి చేతకావు! కాని నీ సంగతి అంతా వేరు!"

చంపకి ఇవేమీ అర్ధం కాలేదు తనకీ ఆ స్వేచ్ఛ కావాలనిపించింది.

మనసు చెంగుచెంగున గెంతులువేస్తే, మనసుతో తనకీ అలానే గెంతులు వెయ్యాలనిపిస్తుంది. తనకి నచ్చిన వారితో సరదాగా తిరిగి, కబుర్లు చెప్పకోవాలనిపిస్తుంది ఆ పక్షుల్లా ఎటో ఎటో ఎగిరిపోవాలనిపిస్తుంది మగాళ్ళకుండే స్వేచ్ఛ ఆడవాళ్ళకి లేకపోవటం అన్యాయం అనిపిస్తుంది. నాన్న. చెప్పిన కులం కాని, హోదాకాని, డబ్బుకాని, మగాడి ప్రవర్తలోని స్వేచ్ఛని అరికట్టడంలేదు.

ఇలా ఎన్నోసార్లు చంపా ఆలోచించేది, కాని ఏం చెయ్యడం? తను ఈ ఇంట, ఈ కులంలో పుట్టింది నాన్నకాడబ్బులేదు. అందువల్ల తన మంచి ప్రవర్తన మరింత ముఖ్యం. తనకి పెళ్ళికావాలంటే మొదట చూసేది పిల్లగుణం ఎటువంటిది అని—దాని గురించి వారికి ఏ అనుమానం కలిగినా తనకింకా పెళ్ళికాదు. నాన్న ధనవంతుడుకాని, హోదా ఉన్నవాడుకాని అయితే అవన్నీ మరుగున పడతాయి. డబ్బే ఉంటే, ఆ డబ్బున్న వర్గాలలోలాగ ఆడపిల్ల ఫ్రీగా తిరగొచ్చు. వారి భావాలు విశాలంగా ఉంటాయి.

చంపా స్కూలుకి వెళ్ళేది...వచ్చేది. అమ్మకి సాయపడేది.

అప్పుడప్పుడు దారిలో అప్పారావు అగుపడేవాడు చంపకి.

అప్పారావు నాలుగయిదేళ్ళు పెద్ద ఆమెకన్న. స్కూల్లో చేరడమే ఆలస్యంగా చేరేడు — వానికితోడు దండయాత్రలు —

చదువు మానేసేక అప్పారావు శరీరకంగానూ, మానసికంగానూ పొడవు ఎదిగిపోయినట్టు అనిపించింది చంపాకి.

నీలం రంగువికాని, కాకీరంగువికాని బట్టలు వేసుకొనేవాడు. వాటినిండా ఇంజనాయిలు మరకలుండేవి. రెండుమూడంగుళాలు పొడవు ఎదిగిపోడమే కాక ఒళ్ళుకూడా పెంచాడు.

కనిపించినప్పుడల్లా చిరునవ్వుతో పలకరించేవాడు —

"చంపా! నువ్వెప్పుడన్నా కారుకొంటే, దానికి మరామత్తుకావస్తే నన్ను పిలువు!" అనేవాడు —

స్కూలు గురించీ, లెక్కల మాష్టారి గురించీ, తక్కిన వారి గురించీ అడిగేవాడు — అప్పారావు అలాకనిపించి, అడిగినప్పుడు రస్తామీద నిలబడి అప్పారావుకి జవాబివ్వక తప్పేదికాదు తనతో జట్టుగానెళ్ళే తక్కిన ఆడపిల్లలు, కాస్త ముందుకి వెళ్ళి నిలబడిపోయేవారు తనకోసం. అప్పారావడిగిన ప్రశ్నలకి జవాబిచ్చి అతడి పనిగురించి ఒకటో రెండో ప్రశ్నలడిగి మళ్ళా తనగుంపులో చేరేది.

ఓసారి రామం అడిగేడు చంపని — "నువ్వా అప్పిగాడితో రోడ్డుమీద నిల్చొని హస్కుకొడుతున్నావుట" రామం మాటలు అమ్మా, నాన్నా వింటున్నారు —

"ఎవరు చెప్పేరు నీకు?" విసురుగా అడిగింది

"ఎవరు చెప్తే నీకేం? నిజమా, అబద్ధమా?"

"పలకరించేడు నిజమే — పలకరించేడు కాబట్టి మాటాడేను! తప్పా?"

"అందరు ఆడపిల్లలూ అలా మగపిల్లలతో మాట్లాడుతున్నారా?"

"వాళ్ళు మాట్లాడకపోతే నేనూ మాట్లాడకూడదని ఉందా?"

"కాలేజిలో నా ఫ్రెండ్స్ అంతా ఏమనుకుంటారు?"

"ఏమో! నాకేంతెలుసు ఏమనుకుంటారో?"

"మీ సిస్టరేమిటోయ్, లారీక్లీనర్‌తో రోడ్డుమీద కబుర్లకి దిగింది? అని అడుగుతారు...నాకది ఇన్సల్ట్!"

"అప్పారావు లారీ క్లీనర్‌కాదు — నాతో చదువుకున్నవాడు — ఇన్సల్టయితే నేను నీ సిస్టరని చెప్పకు!"

"చెప్పక పోయినా వాళ్ళకి తెలీదా? అప్పిగాడిని దొంగబుద్ధులు నీ కంపాస్‌బాక్స్ దొంగలాడలేదా?"

"నీ ఫ్రెండ్సే నాతో మాట్లాడితే నీకు ఇన్సల్టనిపించదా?"

"వాళ్ళెవరూ నీతో మాట్లాడరు!"

"ఎందుకు మాట్లాడరూ? నీ ఫ్రెండ్స్ అందరూ ఇంటికి వచ్చినప్పుడల్లా నాతో మరి మాట్లాడం లేదా?"

"రోడ్డుమీద నిలబడి మాట్లాడేరా?"



**జరిగిన కథ-6** · చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తున్నాడు. మధ్య తరగతి కుటుంబంలోఉండే చికాకులు, సమస్యలు ఆ ఇంట్లోనూ వున్నాయి. చంప నాన్నమ్మకి వోపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు వోపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులుపడ్డారు. చంప మామ అవధానివల్ల నాన్నకి ఏర్పడ్డ చిలుముగొట్టం అలవాటుతో అమ్మా, నాన్నల మధ్య వాదోపవాదాలు చెలరేగేవి. చంప అన్న రామంని కాలేజీలో చేర్పడానికి అమ్మ గాజులు అమ్మక తప్పలేదు. ఖర్చులు పెరగడంతో నాన్న సిగిరెట్లు మానివేయగా చంప బాధపడుతుంది. గతంలో తన కంపాస్ బాక్స్ దొంగిలించిన అప్పారావ్‌ని తన పుట్టినరోజు అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప. అతను వెళ్ళింతర్వాత అలా దొంగిలించడం అతని తప్పు కాదని ఆ విషయంమీద ఓ లెక్చర్ ఇచ్చాడు నాన్న. గీతత్త అంటే రామానికి ఓ ప్రత్యేకమైన అభిమానం. ఆమెకు అన్నీ వున్నా పిల్లలులేరు. నాన్న చెయ్యి చూసి నీకు ఇద్దరు పిల్లలున్నారని చెప్పగా, ఆమె ముఖం వికసించేది. శ్రీనుమీద ప్రేమ కురిపించే చిన్నాన్న పార్వతీపురంలో ఉన్న ఇల్లు అమ్మేసి తన భాగం డబ్బు తనకు పంపమని ఉత్తరం వ్రాస్తాడు నాన్నకు. అమ్మ ఆలోచించి ఆ ఇల్లు అమ్మటానికే నిశ్చయించుకొంటుంది నాన్నతో సంప్రదించినమీదట. అనుకోకుండా అనేకమైన ఖర్చులు నెత్తినపడడంతో ఇల్లుఅమ్మగా వచ్చిన తనవాటా మొత్తం ఖర్చయిపోతుంది. ఈలోగా చంపాపెద్దమనిషయికూర్చుంటుంది.





"అప్పారావు ఇంటికొచ్చి మాట్లాడితే అప్పుడు ఏకిన్పల్లు కాదన్నమాట !"

"వాడి స్టేటసేమిటి, మనస్టేటసేమిటి ? ఈ సారి వాడితో నువ్వు రోడ్డుమీద నిలబడి మాటాడినట్టు రిపోర్టొస్తే నేను ఊరుకోను !"

"నువ్వు కాలేజీలో నీ జూనియర్ లిల్లీతో మాట్లాడుతున్నట్టు నాకూ రిపోర్ట్సు వచ్చేయి !" ఆ బాణం చంపా వదలడంతో, రామం విస్తుపోయేడు —

లిల్లీ క్రిస్టియన్ల పిల్ల — పేరు లిలియన్ — లిల్లీ అని పిలుస్తారు. తెల్లకలువలా ఉంటుంది, అందంగా, తెల్లగా, నాజూగ్గా — ఆమె తల్లి గవర్నమెంట్ హాస్పిటల్‌లో నర్సు. ఆమె గురించి ఎన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి.

లిల్లీ సైన్స్ గ్రూప్ తీసుకుంది. ప్రొఫెషనల్ పాసయ్యేక మెడిసిన్‌లో చేరదామని ఆమె ప్రయత్నం.

"తనకి తెలీని పాఠాల గురించి డౌట్స్ ఉంటే అడిగింది !"

"డౌట్స్ ఉంటే ఇంటికొచ్చి తీర్చుకోమను!" చంపా, అన్నని బోల్తా కొట్టించినందుకు గర్వంగా చూసింది.

"నీ బోడి సలహా ఎవరడిగేరు ?"

"నీ సలహాలూ నా కనవసరం !" చంపా అప్పచెప్పింది.

నాన్నా, అమ్మా కలగజేసుకున్నారు — "ఎందుకర్రా ఆ కొట్లాట ? వయసు పెరిగినా చిన్నతనం పోలేదు — ఆ అప్పారావుతో నీకు కబుర్లేమిటి ? రామం అన్నదాన్లో తప్పేముందీ — ఓ సారి ఆ అప్పారావునిపిలిచి మీరైనా చెప్పండి—అలా రోడ్డుమీద నిలబెట్టి ఆడపిల్లతో మాట్లాడం మంచిదికాదని."

నాన్న అన్నారు ... "వాడేం తప్పుచేసేడే ? ఏదో కుశల ప్రశ్నలు వేసేడు. అప్పారావుతో చంప మాట్లాడినా ఎవరూ తప్పుపట్టరు. అప్పారావు మన కులం వాడుకాడని అందరికీ తెలుసు."

"వాళ్లెలాపోతే మనకేం ? మనకు తగ్గట్టు ఉండాలి ! మన ఆచారాలూ, సాంప్రదాయాలూ మనకున్నాయి" అమ్మ అంది.

"రోజులు మారిపోయేయి అమ్మలూ ! ఓ ఆడపిల్ల మగాడితో మాట్లాడినంత మాత్రాన వంకులు కట్టే రోజులు కావివి. మనకాలం వేరు... మనతరం వేరు — ఈ కాలం, ఈ తరం వేరు. మన పిల్లల్లో మనకి నమ్మకం ఉంటే ఎవ్వరేమన్నా పట్టించుకోనక్కర్లేని అవసరం లేదు !" నాన్న అన్నారు.

"రోజులు ఎన్ని వచ్చినా, పోయినా మనుష్యులు మారరు — ఇంత ఉంటే అంత పుట్టించడం అందరికీ ఉన్న అలవాటే."

నాన్న మరి వాదించలేదు.

మరోసారి అప్పారావు మాట్లాడబోయినప్పుడు చంపా అంది ... "ఇలా నేను రోడ్డుమీద నిలబడి నీతో మాట్లాడ్డం అన్న కిష్టంలేదు ! ఇంటికి రాకూడదూ ?" అంత నిష్కర్షగా చెప్పడం కష్టం అనిపించినా, చెప్పక తప్పలేదు.

"సరేలే చంపా ! నిన్నింక ఇబ్బంది పెట్టను" అప్పారావు చిన్నబుచ్చుకున్నా, కనపడనీయకుండా అన్నాడు.

## 17

నాన్నమ్మ డబ్బు, దానిమీద నెలనెలా వచ్చే వడ్డీ ఎవరికి చెందాలి ? ఈ సమస్యకి పరిష్కారం కష్టమే అయింది.

"మామగారు పోయేక అత్తయ్య ఎవరి దగ్గరుండే వారో, వారికే ఆ డబ్బు చెందుతుంది..." అంటూ తీర్పు చెప్పింది అమ్మ.

కాని అనకాపల్లి చిన్నాన్న ఒప్పుకోలేదు. "అదెలా కుదురుతుంది ? ఆ డబ్బుని మూడు భాగాలుచేసి పంచుకోవడం ఉత్తమం !" అన్నా రాయన.

మరి గత్యంతరం లేక ఆ డబ్బుని ఇమ్మిడి శెట్టి దగ్గర్నించి తెచ్చి మూడు భాగాలు వేసేరు నాన్న. చెరో ఆరు వందలూ వచ్చేయి. ఆ డబ్బుపెట్టి ఇంటి పెంకులు తిరగవేయించేరు — అక్కడక్కడ మరామత్తులు చేయించేరు. పిల్లలందరికీ బట్టలు కొన్నారు మళ్లా జేబులు ఖాళీ.

నెలనెలా ఇంట్లో అయ్యేఖర్చు పెరిగిపోయింది, ధరలూ, పిల్లలూ పెరగడం వల్ల.

*　　*　　*

రామం ఇంటర్ పాసయ్యేడు ఫస్ట్‌క్లాస్‌లో— శ్రీను మెట్రిక్ పాసయి ఇంటర్‌లో చేరేడు. రామం ఇంజనీరింగ్ కాని, మెడిసిన్ కాని చదువుతానన్నాడు—

"అంత డబ్బెక్కడిదిరా బాబూ మనకి! కనీసం పదివేలన్నా ఉండాలి !" నాన్న తన అసమర్థతని వ్యక్తం చేసేరు.

"లోన్ స్కాలర్‌షిప్ మెరిట్‌మీద దొరుకుతుంది నాన్నా !"

"అవన్నీ ఇప్పుడప్పుడే వెంటనే దొరకవు కదా? ముందు మదుపు పెట్టాలిగా ? ఒకవేళ స్కాలర్‌షిప్ దొరికినా అది ఏపాటి కనక ?"

"అయితే ఏం చెయ్యమంటావ్ నాన్నా ?"

"బి ఎస్సీలో చేరు — అది పాసయ్యేక బి ఇడీ చేస్తే మాష్టారు ఉద్యోగం దొరక్కపోదు!"

అమ్మ అడ్డుపడింది — "మంచి మార్కులు తెచ్చుకున్న వాడూ మాష్టారుద్యోగం చెయ్యాలంటే ఎలా ? ఇంటిమీద అప్పు తీసుకురండి !"

"ఈ పాత ఇంటిమీద మూడు వేలన్నా ఎవడూ అప్పివ్వడు ! నెల నెలా దానిమీద వడ్డీ ఎలా కట్టడం ? నెలకి వడ్డీయే ఇచ్చుకోవాలి అరవై రూపాయలు ! ఇచ్చుకోలేకపోతే అది అసల్లో కలుస్తుంది !"

ఇలా వాదోపవాదాలు నడిచేయి.

ఈలోపున రామం ఫారాలు తెప్పించి అప్లయి చేసేడు — మార్కుల మెరిట్‌మీద వైజాగ్‌లో ఇంజనీరింగ్ కాలేజిలో సీటు దొరికింది. దాంతో అతడికి చదవాలన్న ఉత్సాహం పెరిగిపోయింది. విశాఖలోనే కాక, ఖర్గపూర్‌లోనూ, వారణాసిలోనూ కూడా సీట్లు వచ్చేయి

వారణాసయితే బాగుంటుందని అందరూ అన్నారు

ఎక్కడ కాశీ, ఎక్కడ మనం ! రానూపోనూ చార్జీలే అవతాయి ఎనభై రూపాయలు! మనరాష్ట్రం కాదు ! కుర్రాడికి జ్వరమొచ్చినా, జలుబొచ్చినా అక్కడ చూసే దిక్కెవరు? పక్కనున్న విశాఖపట్నం అయితే సదుపాయంగా ఉంటుంది. ఇదీ అమ్మ అభిప్రాయం — అప్పుడే రామాన్ని చేర్పడానికి నిశ్చయించుకున్నట్టు మాట్లాడుతోంది -

నాన్న రామం చదువుగురించి సంప్రదించని బంధువులుకాని, స్నేహితులుకానిలేరు — తలో క సలహా ఇచ్చారు కుర్రాడు తెలివైనవాడు— ఇంజనీరింగ్‌లో సీటురావడం మాటలుకాదు ! సీటు వచ్చింది ! చదివించడం మానేస్తే ఎలా ? అని కొందరి సలహా —

"అంతగా డబ్బులేనప్పుడు పెద్ద చదువు లెందుకు చదివించడం ?" అన్నవాళ్లూ ఉన్నారు బంధువర్గంలో — ఆ మాటల్లో సద్భావం కన్నా అసూయ ఎక్కువగా వినిపించింది.

ఆఖరికెలాగయితేనేం రామంని విశాఖలో ఇంజనీరింగ్ కాలేజిలో చేర్చి తన ఒక చెల్లెలింట్లో ఉంచి వచ్చేరు నాన్న. రామంకోసం ఆమెకయే తిండిఖర్చుకింద యాభై పంపుతాననీ, ఎలాగో ఓలా సర్దుకోమనీ నాన్న కోరారు.

### అభేదం

కళ్లు పొడుచుకున్నా
కనబడని రూపానివి
చెవులు రిక్కించినా
వినబడని రాగానివి
గొంతు చించుకున్నా
వినిపించుకోని స్తబ్దానివి
... . ... .. ..
ఆవేశంతో కాక
అనుభూతుల్లోనుంచి చూసినప్పుడు
తహ తహతో కాక
తన్మయత్వంతో విన్నప్పుడు -
ప్రళయ ఘోషలా కాక
మౌన భాషలో పలకరించినప్పుడు -
అర్థమయ్యే భావాన్ని నేను !
నీ హృదయ స్పందనలోనే
లీనమైయున్న భాష్యాన్ని నేను !!

— గంగుల నరసింహారెడ్డి

బంధువుల ఇంట్లోఉండి చదవడానికి రామాని కిష్టంలేదు. ఉండవలసిన స్వేచ్ఛఉండదు. తన సమయం తన అధీనంలో ఉండదు ! తనకుండే కొద్దిపాటి సమయంలోనూ ఏవోపనులు పురమాయిస్తారు. ఇంట్లో ఒక మగాడున్నాడనగానే అతడు చేత చేయించడానికి పనులు పుట్టుకొస్తాయి. మార్కెట్‌పనులూ, ఏవో చిల్లరమల్లర పనులూ — తనకి చదువుకుందుకి రూమంటూ వేరేగా ఉండదు— బోలెడంత డిస్టర్బెన్సుంటుంది.

ఈ సంగతులన్నీ నాన్నతో చర్చించేడు రామం. కాని నాన్నమాత్రం ఏం చెయ్యగలరు ? తన అసమర్థత వ్యక్తం చేసేరు — పుస్తకాలకీ, తదితర సామగ్రికీ చాలాడబ్బు అవసరం ఔతోంది.

"ఓ ఏడాది ఎలానో ఇబ్బంది పడువాయనా ! ఆ స్కాలర్‌షిప్పేదో వస్తే ఆలోచిద్దాం !"

"అప్పుడు హాస్టల్లో సీటుదొరకడం కష్టం ఔతుంది నాన్నా ! పోనీ, పిన్నిఉండే వీధిలోకాని, అక్కడికి దగ్గరగాకాని ఒక చిన్నగది తీసుకుంటే అద్దెకి ?"

ఈ సంగతి చెల్లెలితోనూ, బావమరిదితోనూ అతను చర్చించేరు. "ఇంజనీరింగ్ చదువంటే ఎంతో ఏకాగ్రతతో చదవాలి — వాడికో చిన్న కొట్టువంటిగది అద్దెకు ఈవీధిలో దొరుకుతే చూసి పెడుదురూ !"

"అదే మేమూ అనుకున్నాం బావా ! మా పక్కింటివాళ్ల వీధిగదుంది ఆగదిలో ఒకమనిషుండి పడుకుందుకీ, చదువుకుందుకీ సదుపాయంగా ఉంటుంది — కరెంటుంది !"

ఆ గది తణికీ చేసేరు. బాగానే ఉంది—వాళ్లు నెలకి అద్దె పదిహేను చెప్పేరు. కరెంటుకి రెండు రూపాయలు. ఒకే బల్బు అరవై వాట్సది వాడాలి ! ఫ్యాన్ పెట్టుకుంటే మరో ఐదు—కరెంటు చార్జీలతో సహా పదిహేనుకి తేల్చేరు. నూరు వాట్ల బల్బు పెట్టుకుందుకి ఒప్పందమైంది రెండు నెలల అద్దె బయానా పుచ్చుకున్నారు.

హాస్టల్‌లో చేర్చకపోవడం వల్ల నెలకి వంద వరకూ కలిసొచ్చింది.

ఈ ఏర్పాట్లన్నీ చేసి ఇంటికి తిరిగి వచ్చేరు నాన్న.

ఈ మధ్య కొన్ని ఆఫర్స్ వచ్చేయి. పెళ్లి ఆఫర్స్ ! రామం తమ అమ్మాయిని పెళ్లాడ్డానికి ఒప్పుకుంటే, అతడి ఇంజనీరింగ్ చదువుకయ్యే ఖర్చంతా తాము భరిస్తామని చెప్పొచ్చేరు

నాన్న వేపు అటువేపు మొగ్గింది

కాని రామం ఒప్పుకోలేదు "ఇప్పట్నుంచీ పెళ్లేమిటి నాన్నా ?"

వాళ్లన్నారు కదా— "పోనీ ఓ పని చెయ్యండి— పదివేలు తీసుకోండి—ప్రోనోట్ రాయండి—అబ్బాయి చదువయ్యేకే పెళ్లి చెయ్యండి — అప్పుడు మీ ప్రోనోట్ మీరు తీసేసుకోండి ! అప్పటికి మీ అబ్బాయి మనసు మారిపోతుందీ ? మా పదివేలూ మాకు తిరిగి ఇచ్చెయ్యండి ! వడ్డీ అవసరం లేదు ! ఏమంటారు ?"

కాని, ఎలా తీర్చడం అన్నది ప్రశ్న !

ఓ ఏడాది గడవనీ . అప్పటికీ ఇబ్బందిగా ఉంటే, ఏదో ఒక పని చెయ్యొచ్చు ! అనుకున్నాడు.

కాశీపతి సంసారం బండీ మళ్లీ మెల్లి మెల్లిగా నడక ప్రారంభించింది. ఏడాది ఏడాదికీ ఆ బండీ మోయవల్సిన బరువు ఎక్కువవుతూ వెళ్లిందే తప్ప తగ్గడం మాత్రం జరగలేదు !

## 18

కాలం ముందుకి నడుస్తున్న కొద్దీ పరిస్థితులూ మారుతూపోతాయి.

ధరలు ఒకవేపు పేదవాడి కోరికల్లా తీరకుండా పెరిగిపోతూ ఉండగా...మరో వేపునించి రూపాయి విలువ నీళ్లపాలలోని పాల పాళ్లు తగ్గినట్టుతగ్గుతూ వెళ్లింది.

వీటికి తోడు పిల్లలు ఎదుక్కరావడం, వాళ్ల చదువులూనూ.

# పాపాయికి పుట్టుకతోనే మీరిచ్చిన కానుక-3 నెలలకు సరిపడే ఐరన్



## 3 నెలలు నిండాక, కేవలం పాలే అతడికి కావలసిన ఐరన్‌ను సమకూర్చలేవు

అతడికి ఇవ్వండి

# ఫారెక్స్

పుష్కలంగా ఐరన్ గలది

"తల్లి నుంచి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందు వల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి."

డాక్టర్ సుభాష్ సి. ఆర్య: "ఇన్‌ఫేంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్"

అంచేత, పాపాయికి 3 నెలలు నిండగానే ఐరన్‌ను ఇచ్చే ఘన ఆహారం ప్రారంభించండి. ఐరన్ అతడి రక్తానికీ, అతడి వ్యాధి నిరోధక శక్తికీ, అతడి శరీర ఆరోగ్యానికీ, అతడి పెరుగుదలకూ, వికాసానికీ అతి ముఖ్యం.

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?**

ఘన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారుచేయబడిన ఆహారం ఫారెక్స్. మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడింది. ఫారెక్స్‌లో ఉన్నాయి— సత్వర పెరుగుదలకు ప్రొటీన్లు; శక్తికోసం కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు. పాపాయికి ఫారెక్స్ ఇస్తే, ఘన ఆహార రూపంలో అతడికి హెచ్చు కాలరీలు లభిస్తాయి. అంచేత పాలు తాగడం తగ్గుతుంది, నమలడం నేర్చుకుంటాడు కూడా. అన్నిటికంటే ముఖ్యంగా, పాపాయి శరీర ఆరోగ్యం, పెరుగుదలకోసం అత్యవసరమైన ఐరన్ పుష్కలంగా కలిగివుంది ఫారెక్స్.




**ఉచితం!** "పాపాయి మొదటి ఏడాది పుస్తకం." కొత్తగా తల్లులైన వారు పిల్లల పట్ల తీసుకోవలసిన శ్రద్ధ గురించి సులభ రీతిలో వివరిస్తుంది. మీ ప్రతి కోసం, 50 పైసల స్టాంపు జతపరుస్తూ ఈ క్రింది చిరునామాకు వ్రాయండి:

**పి. ఓ. బాక్స్ నం. 19119, (FAR 15 I). బొంబాయి 400 025.**

## డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్
## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆదర్శవంతమైన ఘన ఆహారం

CASGLF-12-244 Tel

మధ్య తరగతి కుటుంబాలలో చదువే ఆస్తి కాబట్టి, ఆస్తిని స్థలం అమ్మేసి చదివించవలసి వస్తోంది. మెట్రిక్ చదువుకి ఏ మాత్రం విలువ లేకుండా పోయింది. బి. ఏ. పాసయినా ఏ ఉద్యోగమూ దొరక్కుండా ఉంది

ఎక్కడపడితే అక్కడ కాలేజీలు పుట్టేసి బి. ఏ లనీ, బి ఎస్సీలనీ ఉత్పత్తిచేసి దేశంమ్మీద విరజిమ్ముతున్నాయి వేలసంఖ్యలో.

ఎంప్లాయిమెంట్ ఎక్స్చేంజి రిజిస్టర్లలో పేర్లు రామకోటిలా రోజూఎక్కువౌతున్నాయే తప్ప తరగడం లేదు—అదిఎంప్లాయ్‌మెంటు ఎక్స్చేంజికాదు! ఎంప్లాయ్‌మెంట్ కోసంరిజిస్ట్రేషన్ ఆఫీసు – పేరు నమోదు చెయించుకుందుకి లంచం! కాల్ పంపడానికి లంచం .. కార్డు రిన్యూ చెయ్యడానికి లంచం...

గ్రేడ్యుయేట్లు ఆఖరికి ఖలాసీ ఉద్యోగానికూడా తయారౌతున్నారు. కాని నిరుద్యోగులు పుట్టినంత వేగంగా ఉద్యోగాలు పుట్టడంలేదు – గ్రేడ్యువేషన్ అయ్యేక, సీట్లు దొరుకుతే పి జీలో చేరిపోతున్నారు – పి. జీ అయినా అలానే ఉంది పరిస్థితి –

ఉద్యోగాలకోసం ఇంటర్వ్యూలకి ఎపియరయ్యీ అయ్యీ గూళ్ళూ కాళ్ళూ పీకగా – ఏకొద్దిమందికో న్యాయంగా ఉద్యోగాలు దొరుకుతున్నాయి తక్కిన ఉద్యోగాలు సిఫార్సుదార్ల ప్రాముఖ్యతను బట్టి, సిఫార్సుదార్ల కేండిడేంట్స్‌కి వెళ్లిపోతున్నాయి –

ఇంక తక్కినవాళ్లంతా చేసేందుకు ఉద్యోగం లేక తమ వయస్సు ఉద్యోగ అర్హతల వయసుని దాటిపోతూ ఉండగా, ఏమీ చెయ్యలేక, ఏం చెయ్యడమో తోచక నిస్పృహయంగా నిలబడి పోతున్నారు

ఇంజనీరింగ్ కాలేజీలూ, మెడికల్ కాలేజీలూ పోటీపడి ప్రతి రాష్ట్రంలోనూ లేచిపోతున్నాయి. మొదటి శ్రేణిలో పాసయిన ఇంజనీరింగ్ విద్యార్థులకే

# స్పందన

కాసింత ఆశ – సెకెండ్‌క్లాస్ వచ్చిన ఇంజనీరింగ్ విద్యార్థుల బావి శూన్యమే!

పోనీ న్యాయశాస్త్రం చదివి ప్రాక్టీసు పెడదామంటే ప్రతి పట్నంలోనూ పందల సంఖ్యలో ఉన్నారు. కొత్తగా పట్టాపుచ్చుకున్న లాయరు, సీనియర్ లాయరు దగ్గర పదేళ్లు పడిగాపులుపడ్డా తనంతటతాను నిలదొక్కుకో లేకుండా ఉన్నాడు.

కొత్తగా ఎం. బీ. బీ. ఎస్ పాసయి ప్రాక్టీసు పెట్టిన ఏ డాక్టర్ దగ్గరకీ పేషెంటురాడు!

ఉద్యోగాలు కల్పిస్తామన్న నాయకుల కబుర్లు, కబుర్లగానే మిగిలేయి. అవసరం లేని ఉద్యోగాలు కల్పించి, తమ మనుష్యులను వేసుకొని, ఆజర్బంతా ప్రజలమీద రుద్దడం జరుగుతోంది.

దేశంలో ఇంటువంటి పరిస్థితులున్న సమయంలో శ్రీనుకూడా ఇంటర్ ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యేడు!

ఫస్ట్‌క్లాస్ రాకపోతే తనగతి అధోగతేననీ, తన అమ్మా నాన్నలకి తనని చదివించక పోవడానికి మంచి అవకాశం దొరుకుతుందనీ తెలిసున్న శ్రీను, వారికటువంటి అవకాశం ఇవ్వకుండా పట్టుపట్టి చదివి ఫస్ట్‌క్లాస్ తెచ్చుకున్నాడు.

ఆనాడు బ్యాట్‌మెంటెన్ కోర్టులో అన్నతో సమానంగా ఆడతానని పోటీపడి, శ్రీను పెట్టుకున్న పంతం, పట్టుదల, అతడికి చదువులోకూడా ఉన్నాయి. అన్న ఇంజనీరింగ్ చదువుతున్నాడు.. సరే! తను మెడిసిన్ చదువుతాడు ఆ లక్ష్యం వెంట పరుగు తీసేడు.

అదే సంవత్సరం చంపాకూడా స్కూల్‌ఫైనల్ పరీక్ష పాసయింది – కాలేజిలో చేరతానంది చంపాని చదివించడమా మానడమా అన్న అంశంమీద మళ్ళా వాదోపవాదాలు జరిగేయి చంపాకింకా పదిహేనేళ్లు! పెళ్లి ఇప్పట్లో ఎలానూ చెయ్యము. ఉన్న ఊళ్లోనే కాలేజీ ఉంది. కాబట్టి చదివిస్తే సరి– పెళ్లికూతురు కనీసం గ్రేడ్యుయేటన్నా అయి ఉండాలన్నది ఇవాళారేపు పెళ్లికొడుకుల డిమేండు– పుచ్చుకున్న డబ్బులుకాక! ఉత్త స్కూల్‌ఫైనల్‌తో ఆపేసిన అమ్మాయిలకి పెళ్లిళ్ల మార్కెట్లో గిరాకీ ఉండదు – ఉద్యోగమే ఆడదానికుంటే మరీ మంచిది! ఉద్యోగంలేని మగాడికి ఉద్యోగంలేక ఏడుస్తూ ఉంటే, ఉద్యోగంఉన్న మగాడు భార్య కూడా ఉద్యోగం కావాలంటున్నాడు.

చంపాకి నాన్న పరిస్థితి అర్ధమయింది – తాను చదవక పోయినంతమాత్రాన నాన్న ఖర్చు తగ్గిపోదు.. చదివింత మాత్రాన ఎక్కువయిపోదు– శ్రీను చదువూ, రామం చదువూ నాన్నకి ఓ పెద్ద సమస్యగా తయారవడం ఆమెకి కష్టం కలిగించింది. ఇందులో ఎవరిదిమాత్రం తప్పంది కనక? "మరింక నాతరంకాదు!" అని నాన్న కాళ్ళు తేలవేస్తే శ్రీను భవిష్యత్తంతా పాడవుతుంది.

ఈ ఇంటిమీద మొదటి వెయ్యీకాక, మరో రెండువేలు అప్పుగా తీసుకురావడం జరిగింది నెలనెలా రామానికి పంపాలి .. లోన్ స్కాలర్‌షిప్‌కి పెడితే దొరకలేదు – ఈ ఏడాదికి డబ్బులేదన్నారు– కాబట్టి ఆ ఆశ పోయింది. మిగిలింది మెరిట్ స్కాలర్‌షిప్ – ఆశఉంది కాని, ఆడబ్బు ఎప్పుడు దొరుకుతుందో చెప్పడం కష్టం

ఇటువంటి పరిస్థితిలో శ్రీను మెడికల్ ఎంట్రెన్స్ పరీక్షకి ఫారాలు నింపి పంపేడు–ముందు పరీక్షకి కూర్చున్నాక, సీటువస్తే అప్పుడు ఆలోచించ వచ్చును అన్నాడు.. సీటువస్తే మరి చేసేదేముంది? జాయిన్ అయ్యేవరకూ సత్యాగ్రహం చేసి కూర్చుంటాడు – చదువుకుందుకి తెలివి తేటలున్న వాడికా డబ్బుండదు... డబ్బున్నవాడికా, డబ్బు ఆర్జించే తెలివితేటలే తప్ప చదువు అవసరం లేదు.

శ్రీను మెడికల్ ఎంట్రెన్స్ పరీక్ష పాసయ్యేడు. పాసయ్యేక చదువుతానని పట్టుపట్టేడు.

స్వార్థం వ్యక్తి పురోగమనానికి ఆయువు పట్టు మనిషియొక్క పురోగమనానికి గొడ్డలి పెట్టు – తన బాగు తాను చూసుకోవాలన్న స్వార్థం శ్రీనులో ప్రవేశించింది. "అన్నకి ఇంజనీరింగ్ చెప్పిస్తున్నారు! వాడి ఎక్కువేమిటి? నా తక్కువేమిటి?" అన్న ధోరణిలో మాట్లాడేడు.

"ఎక్కువ తక్కువల ప్రశ్న కాదురా నాయనా! నాకు చెప్పించగల తాహతుందా అన్నది ప్రశ్న!" నాన్న అన్నారు.

అనుకున్నట్టుగానే శ్రీను సత్యాగ్రహం చేసేడు – తిండి మానేసేడు – "మీరు చెప్పించ లేకపోతే చెప్పండి ... నా ఫ్రెండ్స్ ఉన్నారు ... వాళ్లని పట్టుకొని ఎలాగో ఒకలా అవస్థపడతాను!" అన్నాడు.

ఇటువంటి పరిస్థితిలో, ఇది వరకు రామానికి వచ్చినటువంటి పెళ్లి ప్రపోజలే వచ్చింది శ్రీనుకి కూడా – "మేం మీ వాడికి మెడిసిన్ చెప్పిస్తాం – ఎం. బి. బి. ఎస్. అయ్యేక పై చదువులకి విదేశాలకూడా పంపిస్తాం ... అదంతా మాకు



ఎదిరిపెట్టండి ! మా పిల్లని మీ వాడికి చేసుకోండి!" అని — పెళ్ళిని వ్యాపారంగా మాట్లాడేరు. "మా దగ్గర మీ వస్తువు తాకట్టు పెట్టి, డబ్బు పట్టుకపోండి" అన్నట్టు.

నాన్నకిలాటి ఒప్పందం ఇష్టంలేదు — అమ్మ ఒప్పుకోమంది. శ్రీను ఉద్దేశం అడిగేరు. పిల్లని కూడా చూడకుండా, "నా కిష్టమే !" అన్నాడు శ్రీను !

మరి తప్పేటట్టులేదని తెలుసుకొని, పెళ్లి చూపులని అనవాయితీ కోసం ఏర్పాటు చేసేరు ఓ సాయింత్రం.

ప్రకాశరావు పేరుపడ్డ లాయరు — రెండు చేతులా ఆర్జిస్తున్నాడు — అతడికి ముగ్గురు కొడుకులు, ముగ్గురు కూతుళ్లు — డబ్బు తెచ్చే కోడళ్లనీ, హోదా ఉన్న అల్లుళ్లనీ తెచ్చుకోవాలన్నది అతడి కోరిక ! అందువల్ల గెద్ద ఎంత ఎత్తు ఎగురుతున్నా, క్రిందని ఆహారం కోసం కన్నువేసి ఉన్నట్టు, కన్నువేసేడు, తగిన సంబంధాల కోసం. ముగ్గురు అబ్బాయిల తరవాత ముగ్గురమ్మాయిలు.

మీనాక్షికి పదిహేనేళ్లు — స్కూల్ ఫైనల్ పాసయి కాలేజీలో చేరింది. ఏ ఆడపిల్లయినా అందమైనదా? కాదా? అన్న ప్రశ్నకి ఆ వయసులో జవాబు దొరకదు. చిన్ననాడు సాదాగా కనిపించిన అమ్మాయి పదిహేనో ఏటికి మారిపోతుంది—రూపు రేఖల్లో ఏ పోలికలూ దొరకవు — పద్దెనిమిదేళ్లు దాటగానే ఆ పదిహేనేళ్ల పిల్ల పూర్తిగా మారి

# స్పందన

పోతుంది. మీనాక్షి కళ్ళు మీనాల వంటివి కావు. చిన్నవి. కాని కాటుక పెట్టుకుంటే పెద్దవిగా కనిపిస్తాయి. పద్దెనిమిదేళ్లు పైనబడితే, తక్కిన అంగాల అందం వికశించగ, చీరకట్టూ, బొట్టూ మేకప్‌లమీద అందంగా కనిపిస్తుంది.

కాని ఈ రోజున ఆమెలోని అందచందాలని చూడ్డానికి వెళ్లలేదు శ్రీనూ వాళ్లూ — చూపులు ఉత్త మాటవరసకే — ఒప్పందాలు ముఖ్యం !

చూపులయ్యేయి — "ఏంరా శ్రీనూ !?" అంటే, గంగిరెద్దులా తల ఊపేడు పిల్లనచ్చినట్టు సూచనగా. పట్టు పరికిణీ, జాకెట్టు, జార్జెట్ వోణీ, మెడలో పాళ్ల హారం, చెవులకీ, ముక్కుకీ



నగలు ... చేతులకి ధగ ధగా మెరిసిపోతూ బంగారు గాజులు ! పిల్లకేం ... బంగారం బొమ్మ ! అనుకున్నారు శ్రీను అమ్మా, నాన్నా !

ఆనక ఆరంభమయ్యేయి ఒప్పందాలూ ... షరతులూ ..

పెళ్లికూతురికి పద్దెనిమిదేళ్లు రాందే పెళ్లి జరపడానికి వీలులేదు కాబట్టి, రెండేళ్లు ఆగి పెళ్లి చెయ్యాలని అనుకున్నారు ... లేదా ... ఎంబీ పూర్తయ్యేక చెయ్యొచ్చు — కుర్రవాడి చదువుకయ్యే అంత ఖర్చూ, వసతి, భోజనాలతో సహా తమదే పూచీ — అది కాక అదనంగా కాశీపతికి ఐదువేలు రొక్కం ప్రకాశరావు ఇస్తాడు ఇవన్నీ తరవాత కట్నం కింద ఎడ్జస్ట్ అవుతాయి — అయితే తాము నెలనెలా పెట్టేఖర్చుకీ, ఈ ఐదువేలకీ కాశీపతి ఎప్పటికప్పుడు వడ్డీలేని అప్పులా ముట్టినట్టు ఓ కాగితం సంతకం పెట్టాలి—ఏ కారణం వల్లనన్నా, అనగా మగ పెళ్లివారి తరఫునించి పెళ్లి ఆగిపోతే ఆ డబ్బంతా కాశీపతి వాపసివ్వాలి — ఆడపిల్ల తరఫు వారి తప్పువల్ల పెళ్లి జరక్కపోతే ఏమీ వాపసివ్వ నవసరం లేదు ... ఈ విషయం కూడా లోపాయికారిగా కాగితంమ్మీద రాసి, సంతకాలు పెట్టడం జరిగింది.

శ్రీను మెడికల్ కాలేజీలో చేరేడు.

(ఇంకా ఉంది)

పెద్దకథ

# ప్రేమిస్తే ఏమౌతుంది!



విన్నకోట సుశీలాదేవి

(గత సంచిక తరువాయి)

ఇంతలో సర్వర్ వచ్చాడు! కళ్యాణి టిఫిను ఆర్డరు చెప్పింది. సర్వర్ వెళ్లాడు.

"మోహన్! అర్జంటుగా వంద రూపాయలు కావాలి, వున్నాయా!" అనడిగింది కళ్యాణి.

"ఎందుకూ!" అంటూ మోహన్ నిట్టూర్చాడు.

ఇప్పటికే కళ్యాణికి చాలా ఇచ్చాడు! తనూ ఒక సామాన్య వుద్యోగస్తుడే! ఎప్పటికప్పుడు కళ్యాణితో తన విషయం చెప్పాలనుకుంటాడు! కాని చెప్పలేకపోతున్నాడు.

కళ్యాణికి డబ్బుమీదవున్న వ్యామోహం తనకు తెలుసు! తను డబ్బులేని వాడినని తెలిస్తే తనకు దూరమౌతుందేమోనని భయం! కాని చెప్పకుండా ఎన్నాళ్లిలా?

"ఏం లేవా! మోహన్!"

"వుంది ఇస్తాను" అన్నాడు.

కళ్యాణి తేలిగ్గా వూపిరి పీల్చుకుంది. సర్వర్ టిఫిను తెచ్చాడు.

కళ్యాణి ఒకప్లేటు తనముందు లాక్కొని తినసాగింది.

"కళ్యాణీ! నీతో ఒక విషయం మాటాడాలి!" అన్నాడు మోహన్.

కళ్యాణి ఆశ్చర్యంగా చూసింది!

"మాట్లాడు మోహన్!"

"ఇక్కడకాదు! ఏదైనా ప్రశాంతమైన ప్రదేశానికి వెడదాం!"

"ఓయెస్! దానికేం? అలాగే"

"రేపు చెప్తాను ఎక్కడికి వెళ్లాలో!" కాఫీ టిఫిను ముగించి బయటకి వచ్చారు.

కళ్యాణి టైము చూసింది. తొమ్మిదయింది.

"సెంకెడ్‌షోకి వెడదామా మోహన్!"

"ఉహూ! నేను రాలేను కళ్యాణీ! కొద్దిగా పనుంది!" అన్నాడు.

కళ్యాణికి నిరాశ కలిగింది! "సరే! అయితే నన్ను ఇంటిదగ్గర దింపెయ్!" అంది స్కూటర్ ఎక్కుతూ.

మోహన్ కళ్యాణిని ఇంటిదగ్గర దింపాడు. కళ్యాణి ఇంట్లోకి వెడుతూ — "రేపు కన్పిస్తావా!" అంది.

"ఆ!" అన్నాడు మోహన్.

కళ్యాణి ఇంట్లోకి వెళ్లి పోయింది!

బట్టలు మార్చుకుంటూ అనుకుంది!— మోహనేదో ముఖ్యవిషయం మాట్లాడాలన్నాడు! ఏమిటో అది? అయినా మోహన్ ఒట్టి సెంటిమెంటల్ ఫూల్! ఎక్కడికీరాడు. నీతులు, నియమాలు అని మడికట్టుక్కూర్చుంటే మనిషి ఏం సుఖపడతాడు? మోహన్ తనకు ఈ నెలలో గొలుసు చేయిస్తానన్నాడు! ఈ మాటు కన్పించి నపుడు గుర్తు చెయ్యాలి! అనుకుంది.

చెల్లెలు భోజనానికి పిలవడంతో లోపలకు వెళ్లింది కళ్యాణి.

"స్వాతి!"

స్వాతి తలెత్తి రవి వేపు చూసింది

"రేపు కృష్ణా బ్యారేజీకి వెడదామా?" అన్నాడు

"ఎందుకూ?" అంది స్వాతి

"ఎందుకేమిటి? ఎప్పుడూ ఈ నాలుగ్గోడల మధ్య కూర్చోడమేనా? కాస్త మనస్సు విప్పి మాట్లాడుకుందాం!"

"రోజూ మాట్లాడుకుంటూనే వున్నాంగా!"

"ఏం మాట్లాడుకుంటున్నాం! నా మొహం! ఏ మాట మాట్లాడాలన్నా ఎవరన్నా వింటారేమోనని భయం!"

"మరయితే అక్కడ వుండరా, మనుషులు?"

"ఉంటారు కానీ వాళ్లు మనల్ని గూర్చి పట్టించుకోరు! అటువంటి చక్కటి ప్రదేశంలో కూర్చుని నీ కళ్లల్లోకి చూస్తుంటే ఎన్ని కబుర్లు వస్తాయనుకున్నావ్?" స్వాతి కళ్లల్లోకి కొంటెగా చూస్తూ అన్నాడు.

**జరిగిన కథ—3 :** రెవిన్యూ డిపార్ట్‌మెంటులో తాసిల్దారుగా పనిచేసి రిటైరయిన గోవిందరావుకు, ఆయన భార్యకు ఇద్దరు మగపిల్లల తర్వాత పుట్టిన స్వాతి అంటే అమితమైన గారాబం. స్వాతి కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తూంటుంది ఉమ కోరికమీద ఆమె బర్త్‌డే పార్టీకి వెళ్లిన స్వాతికి అక్కడ రవి పరిచయమౌతాడు స్వాతి ఇంటికి రవి రాకపోకలు సాగిస్తుంటాడు. ఆమెతో అతను చోటు చేసుకొంటుంటాడు రవి మాటల్లో తన మావయ్య కూతురు రాధ విషయం రాగా ఎందుకో అతను తనని మోసం చేస్తున్నాడేమో! అనే అనుమానం చిగురుస్తుంది స్వాతిలో రవి తన మామయ్యకు ఇచ్చిన మాట ప్రకారం అతను రాధనే చేసుకొంటాడని కళ్యాణి ద్వారా తెలుసుకున్న స్వాతి కుమిలిపోతుంది. కానీ, తను రాధను ప్రేమించటంలేదనీ స్వాతినే ప్రేమిస్తున్నాననీ, ఆమె ప్రేమ లభించని నాడు తాను బ్రతకననీ అన్న రవి మాటలకు ఆమె మనసు కుదుట పడుతుంది. ఆ తరువాత అతని రాక కోసం ప్రతి రోజూ నిరీక్షిస్తూంటుంది స్వాతి కొలీగ్ కళ్యాణి మోహన్‌మీద ప్రేమకన్నా అతని డబ్బుమీదా, అతను చేయించే వస్తువులమీద వ్యామోహం ఎక్కువ చూపుతుంటుంది తన పరిస్థితిని ఎలాగైనా ఆమెకు చెప్పాలని నిశ్చయించుకుంటాడు మోహన్.

స్వాతి చిన్నగా నవ్వుతూ — "ఏమిటో ఆ కబుర్లు?" అంది

"మచ్చుకొకటి చెప్పనా?"

"ఊఁ!"

"చల్లని వెన్నెలరోజున, మల్లెలు పరిచిన బెడ్‌మీద తెల్లచీర కట్టుకుని నువ్వు పడుకుంటే, నీలోని అందాల్ని నేను చూస్తుంటే అంతకంటె స్వర్గం ఎక్కడుంటుందంటావు!"

స్వాతి ముఖం చిట్లించింది.

"ఛ! ఏం మాటలవి?"

"ఏం బాగాలేదా! అయినా సౌందర్యాన్ని గూర్చి నీకేం తెలుసు? స్వాతీ! నీ అణువణువులోని సౌందర్యం దర్శించి తరించాలి!"

స్వాతికోపంగా "మళ్లీ అవే మాటలా?" అంది.

"తప్పేం వుంది స్వాతీ! ప్రతి మనిషిలోనూ కొద్దో, గొప్పో సౌందర్యారాధన వుంటుంది! సృష్టిలో సౌందర్యానికి పరాకాష్ఠ స్త్రీ! అందమైన స్త్రీ సౌందర్యాన్ని తనివితీరా చూడటం కన్నా సౌందర్యోపాసకుడు కోరుకునేదేముంది? కళారాధకులు ఆరాధించేది ఆ సౌందర్యాన్నే కదా!"

అలా ఉద్వేగంగా చెప్తున్న రవికి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు స్వాతికి

"స్వాతీ! నా కోర్కె తీర్చవూ?"

రవి కంఠంలోని ఆర్ద్రతకు చలించిపోయింది స్వాతి

"తీరుస్తాను రవీ! మీ కోసం ఏదైనా చేస్తాను! మీరడిగిన దేదీ కాదనలేదు మీ ఈ స్వాతి!" అంది.

"స్వాతీ!" లేచి స్వాతి దగ్గిరికి రాబోయాడు రవి

"ఆగండి దొరగారూ! ఇది ఇల్లు!" స్వాతి వారించింది

రవి నిరాశగా మళ్లీ కుర్చీలో కూర్చుంటూ — "నీతో వచ్చిన చిక్కే ఇది!" అన్నాడు

"అవునండీ! దానికి సమయం రావాలి! అంత వరకూ మనకి విరహం తప్పదు!"

"సరేకానీ ముందు బ్యారేజీకి వస్తావా? రావా?" అనడిగాడు సూటిగా

"ఉహు! రాను" తలతిప్పింది స్వాతి.

"రావా!"

"ఉహు!"

"సరే! నీ ఇష్టం" అని వూరుకున్నాడు.

స్వాతి అతనివేపు చూసి నవ్వుతూ—"దొరగారికి కోపం వచ్చినట్టుందే!" అంది

రవి మాట్లాడకుండా సీరియస్‌గా కూర్చున్నాడు

"నిజంగా అదంతా కోపమేనా! చూస్తున్నాగా! నాకు కోపం అంటారు కానీ, అసలు మీకు ముక్కు మీద వుంటుంది కోపం. రవీ! ఆడపిల్లలకు కాస్త బెట్టు వుంటుంది. మీరు కనుక బ్రతిమిలాడారంటే ఆ బెట్టు సడలిపోతుంది. ఇది ఆడవాళ్ల స్వభావం! ఆ మాత్రం తెలీదా ?"

రవి ముఖం ప్రసన్నమైంది.

"ఓ! అది బెట్టా! బ్రతిమాలాలంటే ఎన్నిసార్లైనా బతిమాలుతాను! కావాలంటే కాళ్లమీద కూడా పడతాను" అన్నాడు.

"అయితే బ్రతిమిలాడండి" అంది స్వాతి నవ్వుతూ.

రవి గొంతు సవరించుకున్నాడు.

"స్వాతీ! నా బంగారు స్వాతీ! నువ్వు రాకపోతే నేను బ్రతకలేను! నేను ఏ పనీ చెయ్యలేను! పని అంటే ఆఫీసు పని అన్నమాట! నేను ..." అన్నాడు చేత్తో అభినయిస్తూ.

స్వాతి నవ్వింది.

"ఏం బాగాలేదు! ఏదో తెచ్చిపెట్టుకున్నట్లుంది, కానీ సహజంగా లేదు!" అంది.

"సరే! రాత్రికి బాగా ప్రాక్టీసు చేసి రేపు చెప్తాను. రేపు ఎంత బాగా చెప్తానో నువ్వే చూస్తావుగా."

"సరే" అంది స్వాతి.

క్షణంసేపు మౌనంగా వున్నారు.

"రవీ! ఇవ్వాళ మా ప్రిన్సిపాల్ నన్ను పిలిచి చివాట్లు వేసింది," అంది స్వాతి.

"ఎందుకూ ?"

"పోర్షను పూర్తికాలేదని!"

"ఎందుకని కాలేదు ?"

"ఎందుకు కాలేదో మీకు తెలీదా! పుస్తకం తెరిస్తే చాలు మీరే కన్పిస్తున్నారు. ఇంకెలా పాఠాలు చెప్పను!" అంది విచారంగా.

రవి నవ్వేస్తూ —

"ఓ అదా విషయం! పోనీ ప్రేమ పాఠాలు చెప్పు. పిల్లలకి కూడా ముందు ముందు వుపయోగంగా వుంటుంది" అన్నాడు.

"పిల్లల సంగతి ఏమోగానీ, ముందు నన్ను డిస్మిస్ చేస్తారు."

"చెయ్యనీ, హాయిగా వచ్చి నా కౌగిల్లో వాలిపో! ఇద్దరం పక్షుల్లా ఎగిరిపోదాం!" అని టైము చూసుకున్నాడు.

"అబ్బ! అప్పుడే ఏడయిందే! నీతో మాట్లాడుతూ కూర్చుంటే టైమే తెలీదు."

"ఇంకాస్సేపు కూర్చోండి."

"వద్దు స్వాతీ! మీ ఫాదర్ వాకింగ్ నుంచి వచ్చేస్తారు. ఇంతసేపున్నాడు ఈ దుర్మార్గుడు! మా అమ్మాయికి ఏం నూరిపోస్తున్నాడో అనుకుంటారు."

"సరే! వెళ్లండి" అంది నెమ్మదిగా.

"అప్పుడేనా!" అంటూ స్వాతి ముఖాన్ని చేతుల్లోకి తీసుకుని ముక్కుమీద ముద్దు పెట్టుకుని "సంపెంగ పువ్వువంటి ముక్కు అంటారు. బహుశ నీ ముక్కుని చూసే ఆ వర్ణన వచ్చి వుంటుంది." అని — పెదవుల మీద ముద్దు పెట్టుకున్నాడు.

"స్వాతీ! నీ పెదవులెంత తియ్యగా వున్నాయి? ఏ అమృతం తాగావు ?"

స్వాతి ముఖం చేతుల్తో కప్పుకుంటూ — "ఏమో నాకేం తెలీదు! అయినా రోజూ లంచం లేందే వెళ్లరా !"

"ఊహు ! వెళ్లితే ఇక నిద్రపట్టదు."

"మీరిలా చేస్తోంటే నాకూ నిద్రపట్టదు."

"నిద్రపట్టదా! అయితే ఒక వుపాయం చెప్పనా!" అన్నాడు స్వాతి ముఖంలోకి చూస్తూ —

"ఏమిటది ?"

"మీ దొడ్డివేపు తలుపు తీసివుంచు! రాత్రికి వస్తా" అన్నాడు నవ్వుతూ.

స్వాతి కోపంగా చూస్తూ — "రామ, రామ మీ వ్యవహారం శ్రుతిమించుతోంది!" అంది.

"మించదూ మరి! తొందర్లో మన పెళ్లి

[36 వ పేజీ చూడండి]





'శ్రీవారి ముచ్చట్లు'లో అక్కినేని, జయసుధ

# సినిమా విశేషాలు -జి. వి. జి.

## ఎ. ఎన్. ఆర్ - దాసరి చిత్రాలు

సింగుమారు శ్రీనివాసరావు సమర్పణలో ఎన్. ఆర్. అనూరాధాదేవి నిర్మించిన లక్ష్మీ ఫిలిమ్స్ కంబైన్స్ "శ్రీవారి ముచ్చట్లు" డిసెంబర్ 9న, వెంకట్ అక్కినేని — నాగార్జున అక్కినేని నిర్మించిన అన్నపూర్ణా స్టూడియోస్ "ప్రేమాభిషేకం" జనవరి 9న విడుదలవుతాయి.

~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

'కొత్త నీరు'లో చంద్రమోహన్, దీప



కొడాలి బోసుబాబు నిర్మించే వీరరాణి ఎంటర్ప్రైజెస్ తొలి చిత్రానికి తొలి గీతం నవంబర్ 10న ధ్వనిముద్రిక చేయబడింది. (రాజశ్రీ, చక్రవర్తి, సుశీల). గ్రామీణ యువకుడుగా నటించే ఎ. ఎన్. ఆర్. సరసన జయసుధ, జయప్రదలు నటిస్తారు.

## ఎ. ఎన్. ఆర్ తో రాఘవేంద్రరావు ద్వితీయ చిత్రం

ఈశ్వరీ క్రియేషన్ చిత్రంలో ఎన్. టి. ఆర్‌తో పాటు కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో ఎ. ఎన్. ఆర్. తొలిసారిగా నటిస్తున్న విషయం పాఠకులకు విదితమే. ద్వితీయ చిత్రం — సంక్రాంతికి అన్నపూర్ణా స్టూడియోస్ ప్రారంభించేది. శ్రీదేవి నాయిక. సత్యనారాయణ, మోహన్‌బాబు, అల్లు రామలింగయ్య, దీప ఆదిగా గలవారుంటారు. సత్యానంద్ సంభాషణలు, చక్రవర్తి సంగీతం ఇతర ఆకర్షణలు. కె. ఆంజనేయచౌదరి ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. అన్నపూర్ణా స్టూడియో ప్రారంభమై వచ్చే సంక్రాంతికి నాలుగేళ్ళవుతుంది.
~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~~

## ఇల్లాలులో అంతర్యుద్ధం!

"కల్పనకు, ఆమె మనస్సుకు జరిగే ఘర్షణను మాస్క్ షాట్‌లో తీస్తున్నాం," అని సన్నివేశాన్ని వివరించారు డైరెక్టర్ తాతినేని రామారావు.

హోటల్ గది... జయసుధ (కల్పన) వ్యధతో ఓ ఫోటో దగ్గరికి వెళ్ళింది. "వీల్లేదు. ప్రకాశ్ నా బిడ్డ... నా ప్రాణంలో ప్రాణం – నా కొడుకుని నానుంచి ఎవరూ వేరు చెయ్యలేరు!" అంది ఆవేశంతో. ఇంతలో వికటాట్టహాసం వినిపించింది. కల్పన అటు తిరిగేసరికి ఆమె ఆత్మరూపం నవ్వుతూ కనిపించింది.

"పిచ్చిదానా! నీ కొడుకుని నీనుంచి వేరు చేసింది ఎవరు? నువ్వే! నువ్వే చేజేతులా దూరం చేసుకున్నావు; ఈ బతుకుని కోరుకున్నావు. నువ్వు కోరుకున్నది నీకు దక్కింది. ఇప్పుడు కన్నీరు కారిస్తే, ఏం లాభం?" అంది ఆత్మ గంభీరంగా.

"లేదు; నేనప్పుడు పొరబాటు చేశాను," అంది కల్పన.

"పొరబాటు – నిప్పు. పశ్చాత్తాపం – బూడిద. చేసిన పొరబాటును పశ్చాత్తాపం సరిదిద్దలేదు."

"నా బిడ్డ మరొకరిని 'అమ్మా' అని పిలవడం నేను భరించలేను. నాకా పిలుపు కావాలి. ఆ ప్రేమ కావాలి."

"ఒకప్పుడు నీ దగ్గర ఏ తల్లి అయినా గర్వపడే ఆస్తి ఉంది. దాన్ని వదులుకొని, కాగితం ముక్కలకి ఆశపడ్డావు. ఇవాళ ఆ కాగితాలేమన్నాయి? తల్లి ఆశించే ఆ సంపద మాయమైంది."

"నాకింకేమీ వద్దు. నాకు ప్రకాశ్ కావాలి... ప్రకాశ్! ప్రకాశ్!" అంటూ ఫోటోను కళ్ళకద్దుకొని, భోరున విలపించసాగింది కల్పన.

అట్లూరి పూర్ణచంద్రరావు సమర్పించే బాబూ ఆర్ట్స్ "ఇల్లాలు" చిత్రాన్ని జి. బాబు నిర్మిస్తున్నారు.



'బంగారు బావ'లో కృష్ణ

'పులిబిడ్డ'లో కృష్ణంరాజు, శ్రీదేవి

## విశ్వనాథ్ — యూనిఫామ్

ఒక రోజు ఉదయం డైరెక్టర్ కె. విశ్వనాథ్ హాఫ్ పాంట్, సాక్స్, బూట్స్‌తో ఆయన నివాసం దగ్గర కనిపించేసరికి "షటిల్‌కాక్ ఆడివస్తున్నారా?" అన్నాను. "కాస్సేపు దేహపరిశ్రమ, కాస్సేపు భగవధ్యానం మనసుకు ప్రశాంతతను, నూతనోత్సాహాన్ని, నూతనోత్తేజాన్ని కలిగిస్తాంటాయి కదా ?" అంటూ షర్ట్ జేబులోంచి ఒక కాగితంముక్క తీసి, విలిపి అవతల పారేశారు. అది బస్సు టిక్కెట్టు.

"బస్సులో వచ్చారా!" అన్నాను. "అవును. కారు డ్రయివర్‌ను పేకువఝామునే రమ్మనడం ఎందుకని షటిల్ ఆటకి బస్సులోనే వెళ్లివస్తూంటాను," అన్నారు. ఎంతటి నిగర్వి — నిరాడంబరజీవి !

ఇంతకీ, అసలు విషయం చెప్పడం మరిచాను. ఆయన షూటింగ్ సమయాలలో ఎప్పుడూ కాకీ యూనిఫామ్‌లో కనిపిస్తూంటారన్న విషయం చాలామందికి తెలుసు. డి. వి. ఎస్. రాజుగారు నిర్మించిన "చిన్ననాటి స్నేహితులు"లో హీరో సైనికాధికారి. అలాంటి అధికారి యూనిఫామ్ ఎలా ఉంటుందో పరిశీలించడానికి విశ్వనాథ్ ఒకసారి మద్రాసు — సైంట్ థామస్‌మౌంట్‌లోని ఓ డిఫెన్స్ కార్యాలయానికి వెళ్లొచ్చారు. ఆ ప్రకారం హీరోకు యూనిఫామ్ కట్టించమన్నారు. అప్పట్నుంచి ఆయన కూడా కాకీ యూనిఫామ్ ధరించడం మొదలెట్టారు.

అలా యూనిఫామ్‌లో కనిపించే మరో డైరెక్టర్ కె. బాపయ్య.

'త్యాగమూర్తి'లో సంగీత



## 'సప్తపది'

"వేదమంత్రాలు నేపథ్యంగా గల ఓ సన్నివేశం కోసం ఉద్దండులైన ఘనాపాఠీలను మనదైపు నుంచి ప్రత్యేకంగా రప్పించి, ఆ వేదపఠనాన్ని కూడా మధురాతిమధురంగా రికార్డ్ చేయించాం," అన్నారు భీమవరపు బుచ్చిరెడ్డి. ఈయన నిర్మించే సంగీత రసార్ణవం "సప్తపది". ఇందులో 'శంకరాభరణం' తర్వాత కె. విశ్వనాథ్ దర్శకత్వంలో జె. వి. సోమయాజులు మరో అపురూపమైన పాత్రలో దర్శనమివ్వబోతున్నారు. అమరావతి క్షేత్రంలో, ఆ చుట్టుపక్కల త్వరలో చిత్రీకరణ మొదలవుతుంది. జంధ్యాల, మహదేవన్, వేటూరి, కస్తూరి, తోట, జి. జి. కృష్ణారావు, నండూరి విజయ్, బి. అంజిరెడ్డి తెరవెనుక కృషి చేస్తారు.

## పక్కింటి అబ్బాయి

అంకాళమ్మ మూవీస్‌వారి పై చిత్రానికి నవంబర్ 22న ప్రారంభోత్సవం జరిగింది. నారాయణరావు, రావు గోపాలరావు, పి. ఎల్. నారాయణ, సాక్షి రంగారావు, చిట్టిబాబు, విజయమోహన్, మల్లికార్జునరావు, వాగేశ్వరరావు, పి. వి. రావు, శ్రీనివాస్, శివాజీ, వైశాలీ, లలిత, శ్రీసుధ, సూర్యకాంతం, లతప్రియ, జయమాలిని పాత్రధారులు. కథ, మాటలు : బాబు. ఛాయ : పి. గోపాలరావు. కూర్పు : వెంకటరత్నం. సంగీతం : జి. కె. వెంకటేశ్. చీఫ్ ఎగ్జిక్యూటివ్ : బి. నారాయణరావు. నిర్మాణ సలహాదారుడు : పి. రామారావు. సమర్పణ : రామనాథగుప్త. నిర్వహణ : బి. కృష్ణ, సూర్యబాబు. సహకార దర్శకులు : సాంబశివరావు, మణి. నిర్మాత : కుచ్చెర్లపాటి జగన్నాథరాజు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : ఆకెళ్ళ శ్రీరాం.

## వివేకా ఫైన్ ఆర్ట్స్

శోభన్‌బాబుతో వి. మధుసూదనరావు దర్శకత్వంలో గూడపాటి గోపి మురళి, జ్యోతి కుమారస్వామి నిర్మించే చిత్రానికి నవంబర్ 16న తొలి గీతం ధ్వనిముద్రిక చేయబడింది. రంగనాథ్, జగ్గయ్య, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, రీనా, అంజలీదేవి, కాకినాడ శ్యామల పాత్రధారులు. కాశీ విశ్వనాథ్, చక్రవర్తి, వినాయకం, భాస్కరరాజు, డి. వెంకటరత్నం, ఎ. పూర్ణచంద్రరావు, దొరై, ఆర్. శ్రీనివాసరావు తెరవెనుక కృషి చేస్తున్నారు.

మీ అభిమాన అందాల తారల
ఒరిజినల్ ఫోటోలతో - ప్రకృతి దృశ్యాలతో
## గ్రీటింగ్ కార్డులు చాలా రకాలు!
రూ 2 * రూ 3 మాత్రమే! M.O. ద్వారా పంపండి.
**సౌందర్య లైబ్రరీ** పున్నమ్మతోట, విజయవాడ-10
PHONE 74584

RATNA V.T.S

---

వేటూరి సాహిత్యానికి చక్రవర్తి స్వరకల్పనలో రికార్డులు విడుదలైనాయి!
మీరు విన్నారా?




శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్సు

# పండంటి జీవితం

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం: తాతినేని రామారావు * నిర్మాత: మిద్దే రామారావు

SREE PUBS



'మానవుడు—మహనీయుడు'లో శోభన్, జయమాలిని

## దుర్గా నాగేశ్వరరావు చిత్రాలు

"ఉదయం ప్రొడక్షన్స్ 'స్వర్గం' చిత్రం డిసెంబర్ రెండవ వారంలో రిలీజవుతుంది," అన్నారు డైరెక్టర్ కె. దుర్గా నాగేశ్వరరావు. ఈయన తదుపరి చిత్రాలు : దాసరి కథ, మాటలు, పాటలు, చిత్రానువాదం, పర్యవేక్షణలో నవజ్యోతి పిక్చర్స్ ద్వితీయ చిత్రం, మణియన్ ఫిలిమ్స్ (కథ, స్క్రీన్‌ప్లే దాసరి), వెంకటేశ్వర క్రియేషన్స్ (స్క్రీన్‌ప్లే, మాటలు : దాసరి) లక్ష్మీ నరసింహా ప్రొడక్షన్స్ (స్క్రీన్‌ప్లే, మాటలు : దాసరి), శ్యాంప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్, శ్రీ లలితా ఎంటర్‌ప్రైజెస్ (కథ, స్క్రీన్‌ప్లే, మాటలు : దాసరి), కృష్ణ హీరోగా ఫల్గుణా ఫిలిమ్స్ (కథ : దాసరి).



# సినిమా

## రోజా మూవీస్

"ఏప్రిల్‌లో కొత్త పిక్చర్ మొదలెడుతున్నాం," అన్నారు నిర్మాత ఎం. అర్జునరాజు. ఈయన, కె. శివరామరాజు గతంలో నిర్మించిన "వేటగాడు" ఎంతటి ఘన విజయం సాధించిందో అందరికీ తెలుసు. కొత్త చిత్రంలోనూ ఎన్. టి. ఆర్., శ్రీదేవి నాయకా నాయికలు. కె. రాఘవేంద్రరావు దర్శకుడు. "జూన్‌కు షూటింగ్ అయిపోతుంది," అన్నారు నిర్వహణ బాధ్యతలు చూసే కుమార్జీ. అక్టోబర్ 17న విడుదలైన "వేటగాడు" హిందీ చిత్రం కూడా దిగ్విజయంగా ప్రదర్శింపబడుతోంది. దీన్ని తమిళంలోనూ రజనీకాంత్‌తో తీసే ఉద్దేశ్యం ఉంది.

## దాసరి, ఎ. ఎన్. ఆర్., రామానాయుడు

"ఫిబ్రవరి 1 నుంచి షూటింగ్ ఉంటుంది," అన్నారు సురేష్ అధినేత డి. రామానాయుడు. ఈయన దాసరి రచన, దర్శకత్వంలో నిర్మించే "ప్రేమ మందిరం"లో ఎ. ఎన్. ఆర్., జయసుధ, జయప్రద, సత్యనారాయణ, మోహన్‌బాబు, ప్రభాకరరెడ్డి, అల్లు రామలింగయ్య ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. మహదేవన్ సంగీత దర్శకుడు. సెల్వరాజ్ ఛాయాగ్రాహకుడు.

## వెంకటేశ్వర ఎంటర్‌ప్రైజెస్ చిత్రాలు

"నేను నిర్మించే మా వెంకటేశ్వర ఎంటర్‌ప్రైజెస్ 'బంగారు మీనాక్షి' చిత్రానికి కొమ్మినేని డైరెక్టరు. మోహన్‌బాబు, దీప, ప్రభాకరరెడ్డి, రాజ్‌బాబు జయమాలిని, విజయబాబు ఆర్టిస్టులు. రాజశ్రీ డైలాగ్స్, చక్రవర్తి మ్యూజిక్, లోకన్ కెమెరాతో నా మిత్రుడు గుత్తా రాధాకృష్ణ సమర్పిస్తారు " అన్నారు ఆనందనాయుడు.

దాసరి స్క్రీన్‌ప్లే, మాటలు, పర్యవేక్షణలో దుర్గా నాగేశ్వరరావు దర్శకత్వం వహించే "నెలవంక" (మాదిరెడ్డి సులోచన నవల)ను మోహన్‌బాబు సమర్పిస్తారు. మోహన్‌బాబు, గిరిబాబులకు విశిష్టమైన పాత్రలుంటాయి. ఒక టాప్ హీరోయిన్‌ను త్వరలో సెలెక్ట్ చేస్తారు. గుత్తా రాధాకృష్ణ నిర్వహణలో ఆనందనాయుడు నిర్మాత.

కె. బాలచందర్ దర్శకత్వంలో ఫ్రాన్స్, స్విట్జర్లాండ్, జర్మనీ, ఇటలీలో షూట్ చేయబడిన ప్రేమాలయావారి "47 రోజులు" చిత్రంలో జయప్రద, చిరంజీవి, స్విట్జర్లాండ్ నటి లూసియా, గౌరవ పాత్రల్లో శరత్‌బాబు, రమాప్రభ కనిపిస్తారు. ప్రేమాలయావారి మరో చిత్రం "ఆకలి రాజ్యం"లో కమలహాసన్, శ్రీదేవి, రమణమూర్తి, సరోజ పాల్గొన్నారు ఈ రెండు చిత్రాలకూ గణేశ్‌పాత్రో, ఎం. ఎస్. విశ్వనాథం, ఆత్రేయ, బి. ఎస్. లోకనాథ్, ఎన్. ఆర్. కిట్టూ సాంకేతిక నిపుణులు. వాణిజ్య వ్యవహారాలను వెంకటేశ్వర ఎంటర్‌ప్రైజెస్ సంస్థ చూస్తుంది.

దీపావళి రోజున తమిళనాడులో విడుదలైన 14 తమిళ చిత్రాల్లో "ఆకలి రాజ్యం" తమిళ వెర్షన్ "వరుమయిన్ నిరమ్ శివప్పు" ఒక్కటే హిట్ అయింది ఇది "మరో చరిత్ర"లా మరో చరిత్ర సృష్టించగలదేమోనని కూడా అనుకుంటున్న వారు లేకపోలేదు.

## మురళీమోహన్ సమర్పించే రామదండు

కె. బాలచందర్ పర్యవేక్షణలో ఆర్. ఎస్. మణి దర్శకత్వం నెరపే కళాకేంద్ర మూవీస్ "రామదండు"లో మురళీమోహన్, సరిత, చక్రవర్తి, శ్రీ శైలజతోపాటు ఓ డజనుమంది బాలలు కూడా పాల్గొంటున్నారు. ఆత్రేయ రచన, విశ్వనాథం సంగీతం, రఘునాథరెడ్డి ఛాయ ఇతర ఆకర్షణలు.

ఒకే రక్తం యిద్దరిలో....
బుద్ధులు మాత్రం విరుద్ధం!



శీరం లక్ష్మణరావు సమర్పించు రికో ఫిలింస్ వారి

# రక్తబంధం

కలర్





కథ, స్క్రీన్ ప్లే, దర్శకత్వం
ఆలూరి రవి

నిర్మాతలు
శ్రీమతి యస్. విజయలక్ష్మి, పి.యస్. కృష్ణ





TLARAKAPRABHU ADS.

---

తప్పక చూడండి!

ఆర్. అచ్చప్ప సమర్పించు గోమాత ఆర్ట్ క్రియేషన్స్

# మూడుముళ్ళబంధం

కలర్

కథ - స్క్రీన్ ప్లే - దర్శకత్వం:
ముత్యాల సుబ్బయ్య

నిర్మాతలు:
ఆర్. అశ్వర్థనారాయణ, పొన్నతోట రఘురాం

నిర్మాణ నిర్వహణ: వీణ వెంకటేశ్వరరావు









రాకుండా వుంటే ఇంకా మించుతుంది" అన్నాడు బయటికి నడుస్తూ.

స్వాతి రవి వెనకాతే బయటికి వచ్చి – "రేపు వస్తావా!" అంది.

"రాకుండా వుండగలనా!" అని వెళ్ళిపోయాడు

*　　*　　*

"మోహన్! గొలుసు చేయిస్తానన్నావు ఏదీ!"

హోటల్లో కూర్చుని వుండగా మోహన్ని అడిగింది కళ్యాణి

చేతిలోని కప్పు టేబిల్‌మీద పెట్టి – "చేయిస్తాను కళ్యాణీ!" అన్నాడు.

ఆ మాటలకి కళ్యాణి ముఖం చిట్లించింది.

"మోహన్! ఈ మాట నెలరోజుల్నించీ చెప్తున్నావ్! ఇంకా ఎన్నిరోజులు ఇలా చెప్తావ్?"

"కళ్యాణీ! నీకు కావాల్సింది గొలుసా? నేనా?" అడిగాడు తీవ్రంగా.

ఆ మాటకి తడబడిపోతూ—"నువ్వే అనుకో! ప్రస్తుతం మాత్రం గొలుసు కావాలి?"

"కళ్యాణీ! ఒక్క విషయం చెప్పనా?"

"చెప్పు!" చిరాగ్గా అంది

"కళ్యాణీ! ఇప్పటికే నీ గురించి చాలా అప్పులు చేశాను. ఇక చెయ్యలేను!"

కళ్యాణి తెల్లబోయింది.

# ప్రేమిస్తే ఏమౌతుంది?

[29 వ పేజీ తరువాయి]

"అప్పులా! ఎందుకు?"

"ఎందుకేమిటి? నీకు కొన్న చీరలు, ఇచ్చిన డబ్బు ఎక్కడినుంచి వచ్చాయనుకున్నావ్?" అని ప్రశ్నించాడు.

"నీకు వెయ్యి రూపాయలు వస్తున్నాయి ఆ డబ్బు ఏం చేస్తున్నావ్?"

మోహన్ చిన్నగా నిట్టూర్చాడు.

"కళ్యాణీ! నీకు అసలు విషయం తెలీదు. ఎన్నాళ్ళనుంచో నీకు చెప్పాలనుకుంటూ వుండే వాడిని. మాది పెద్ద కుటుంబం. నాన్నగారికొచ్చే డబ్బు చాలదు ఇంటికి ప్రతినెలా అయిదొందలు పంపాలి. ఒకోక్కసారైతే ఇంకా ఎక్కువ పంపాల్సి వస్తుంది. ఏం చేస్తాం. తప్పదు కదా!"

కళ్యాణి ఆ మాటలు విని ప్రాన్పడిపోయింది! ఇన్నాళ్ళూ తనకీ విషయాలు తెలీదు. మోహన్‌కి కూడా తనలాగే బాధ్యతలున్నాయా? కంపెనీ మేనేజరు, డబ్బున్నవాడనుకుంది. మోహన్ని పెళ్ళి చేసుకోవాలనుకుంది కూడా! ఇం కా న యం! మోహన్‌తో అనలేదు! ఇక మోహన్ నుంచి తనకు పైసా రాదన్నమాట! మోహన్‌తో స్నేహం తెంచుకోవాలి! పోనీలే! వెలుతురుండగానే కళ్ళు తెరుచుకుంది.

"కళ్యాణీ! మాట్లాడవే! నా గురించి చెప్పి నిన్ను బాధపెట్టానా?"

"అబ్బే! లేదు!" అంది పొడిగా.

"కళ్యాణీ! నువ్వు నా ప్రక్కనుంటే ఇటువంటి బాధల్ని ఎన్నిటినైనా భరించగలను కళ్యాణీ! జీవితంలో ఏది లేకపోయినా విచారించను నేను. నీ ప్రేమ ఒక్కటీ చాలు నాకు."

మోహన్ ఆవేశంగా చెప్పుకుపోతున్నాడు.

కళ్యాణి ఆ మాటలేవీ వినడంలేదు! మోహన్ గొలుసు ఇస్తాడని ఎన్నో ఆశలు పెట్టుకుంది ఆ గొలుసుని కాలేజీలో అందరికీ గొప్పగా చూపించాలనుకుంది. ప్చ్! ఛాన్సుపోయింది.

"ఇక లేద్దామా! మోహన్!" అంది బ్యాగ్ చేతికి తగిలించుకుంటూ

తను ఆశించిన రెస్పాన్సు కళ్యాణి నుంచి రానందుకు మోహన్ బాధపడ్డాడు. అయినా కళ్యాణికి తనమీద ఎటువంటి అభిప్రాయం వుందో తెలుసుకోకుండానే తను తన విషయం చెప్పి పొరపాటు చేశాడేమో!

"కళ్యాణీ! నేను అన్నదానికి ఏం సమాధానం చెప్పలేదే?" అన్నాడు వుండబట్టలేక.

"తర్వాత చెప్తాలే! చీకటి పడుతోంది!" అంది విసుగ్గా.

మోహన్‌కి నిరాశ కలిగినా చేసేదిలేక అక్కడి నుంచి లేచాడు.

ఆ రాత్రే కళ్యాణి నిర్ధారణ చేసుకుంది. ఇక మోహన్‌తో తెగతెంపులు చేసుకోవాలని.

*　　*　　*

ఈమధ్య మళ్ళీ అన్నయ్య దగ్గర్నించి సెలవులకు రమ్మంటూ వుత్తరం వచ్చింది స్వాతికి. కానీ రవిని వదిలి వెళ్ళాలనిలేదు

అందుకే పేపర్లు దిద్దాలి, అవి అయ్యాక వస్తానని రాసింది.

రవి ఈమధ్య సరిగ్గా రావటంలేదు.

ఏమిటంటే, కంపెనీ పని అంటాడు.

రవి ఒక్క రోజు రాకపోతే, ఇక ఎప్పటికీ రాడేమో అన్పిస్తుంది.

అది రవికి చెప్తే అతడు నవ్వేస్తూ –

"అంతే స్వాతీ! ప్రేమంటే అలాగే వుంటుంది" అంటాడు.

రవి రానప్పుడు ఒక్కోక్కసారి అన్పిస్తుంది. రవి నిజంగా తనని ప్రేమించి వుండడు! ఏదో అందంగా, ఆకర్షణీయంగా కన్పిస్తే కొన్నాళ్ళు కాలక్షేపం చేద్దామని తనతో స్నేహంచేసి వుంటాడు. ఆ మోజు తీరాక తనని మర్చిపోతాడు.

ఇప్పుడు బహుశ తనని మర్చిపోయే స్థితిలో వున్నాడేమో! లేకపోతే ఎందుకు రాడు? తను అతన్ని చూడాలని, అతనితో మాట్లాడాలని ఇంత తపించిపోతోందే! అతనికేమైనా వుందా?

ఛీ! ఈ మగవాళ్ళకు స్త్రీల కున్నంత గాఢమైన ప్రేమ వుండదు.

ఇలా అనుకుంటుండగానే రవి వచ్చాడు. స్వాతి కోపంతో మాట్లాడకుండా కూర్చుంది.

"రాతిగారు మౌన వ్రతం పట్టినట్లున్నారు. అయితే నేను రేపు వస్తాను" అన్నాడు రవి నవ్వుతూ.

అప్పటికీ స్వాతి మాట్లాడలేదు. పుస్తకం తిరగేస్తూ కూర్చుంది.

"సరే! మీరు పుస్తకం చదువుతూ వుండండి! మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యడం నా కిష్టంలేదు!" అంటూ కుర్చీలోంచి లేచాడు.

రవి నిజంగా వెళ్లిపోతాడేమోనని భయం కలిగింది స్వాతికి.

కాని తనంతట తాను మాట్లాడ్డం ఇష్టం లేదు రవి కాస్సేపు బ్రతిమిలాడాలి! అప్పుడు మాట్లాడాలి! కాని రవి కుర్చీలోంచి లేవగానే —

"వెళ్లండి! పాపం చాలా పనులున్నాయను కుంటాను" అంది నిష్ఠూరంగా.

రవి తిరిగి కుర్చీలో కూర్చుని, "అయితే! అది వ్రతం కాదన్నమాట! నామీద కోపమా!"

"కోపం రాదా? మీరు ఎప్పుడు వస్తానన్నారు? ఎప్పుడు వచ్చారు? ఇచ్చిన మాటని నిలబెట్టుకోవా లండీ!"

"మీకేం అయిదయ్యేసరికి కాలేజీనుండి వచ్చి కూర్చుంటారు. మాది అలా కాదు! మాది ప్రైవేటు కంపెనీ. మా బాస్ ఒక రాక్షసుడు! వాడికి ఇల్లూ, వాకిలీ అక్కర్లేదు. మిగతావాళ్ల కూడా అలాగే పనిచేయాలంటాడు. ఇక నాలాటి బ్రహ్మచారుల్ని చచ్చినా వదలడు."

"అయితే మాత్రం ఇన్ని రోజులా! చూడాలని వుంటే ఎలాగైనా రావచ్చు! మనసుంటే మార్గ ముంటుందండీ!" అంది నిష్ఠూరంగా.

"నాకు మనసుందో లేదో నీకు తెలుసు వేరే నేను చెప్పడం దేనికి!" అన్నాడు.

ఆ మాటతో స్వాతి కోపం కరిగిపోయింది రవిని తప్పుగా అర్థం చేసుకున్నందుకు బాధపడింది

"అదికాదు రవీ! మీరు ఒక్కరోజు రాకపోతే నేనుండలేను!"

"నాకు మాత్రం రావాలని వుండదా? అందునా ఎంతోకాలం వేచి ప్రసన్నురాలిని చేసుకున్న నా దేవతని చూడకుండా నేను వుండగలనా! ఏం చేయను! ఏవో పనులు! ఒక్కొక్కసారి అనిపిస్తుంది! ఈ ఉద్యోగానికి రిజైనిచ్చి హాయిగా నీతో కబుర్లు చెప్పుకుంటూ వుండిపోవాలని! కాని ఏం చెయ్యను! అది సాధ్యం కాదుకదా?"

ఆ మాటలతో స్వాతి మనస్సు ఆనందంతో పుప్పొంగిపోయింది.

"రవీ! ఇదే! అదే రవీ! ఆ ప్రేమే నేను కోరుకునేది!" అనుకుంది మనస్సులో.

"రవీ! రోజూ వుదయం లేస్తూనే సాయంత్రం ఎప్పుడవుతుందా! ఎప్పుడెప్పుడు మిమ్మల్ని చూస్తానా అనిపిస్తుంది సాయంత్రం అయిదు తర్వాత కాలేజీలో ఒక్క క్షణం వుండబుద్ధి కాదు. ఒకవేళ కాలేజీలో ఏదైనా మీటింగు కానీ, ఫంక్షన్ కానీ వుందని తెలిస్తే ఇక నా బాధ చెప్పనలవి కాదు. మనసంతా ఇక్కడే వుంటుంది. ఫంక్షన్ అవగానే పరిగెట్టుకు వస్తాను. అప్పుడు కనుక మీరు రాలేదని తెలిస్తే ఎంత బాధ, కోపం వస్తాయో తెలుసా? ఇక ఆ పూట అందరిమీదా చెప్పరాని చిరాకు వస్తుంది. ఈ లోకమంతా శూన్యంగా అన్పిస్తుంది! రవీ! నా మాటలు విని నవ్వుకుంటున్నారా?"

"ఛ! నవ్వడమెందుకు! నాకు అంతకన్నా కావల్సిందేముంది? నీ నోటి నుంచి ఇటువంటి మాటలు వినాలనేగా నేనిన్నాళ్లూ ఎదురుచూసింది. స్వాతీ! ఇక లాభంలేదు. మీ నాన్నగారితో మాట్లాడేస్తాను."

"ఏ విషయం?"

"మన పెళ్లిని గూర్చి! రాధకి కూడా చూస్తున్నాను. వీలుంటే వచ్చేనెలలో మన పెళ్లిళ్ల జరుగుతాయి! ఇక ఆ తర్వాత .." రవి నవ్వుతూ స్వాతి ముఖంలోకి చూశాడు.

"ఆ తర్వాత ... ఆకాశంలో పక్షుల్లా—నదిలో చేపల్లా — హాయిగా గడుపుతాం కాలం! కోరుకున్న వ్యక్తితో పెళ్లి!

ఇంతకంటె అదృష్టం ఏముంటుంది! తనింతవరకూ ఎన్నో ప్రేమల గూర్చి చదివింది! అన్ని ప్రేమలూ చివరికి విషాదాంతాలే అయ్యాయి! ప్రేమించిన వాళ్లల్లో కొద్దిమంది మాత్రమే పెళ్లి చేసుకోగలిగారు! పెళ్లి చేసుకున్న వాళ్ల కూడా కొన్నాళ్లకి ఏవో గొడవలు వచ్చి విడిపోయారు! తాము పెళ్లి చేసుకున్నందుకు విచారించారు!

కాని తను ప్రేమించినవాడిని పెళ్లిచేసుకో బోతోంది! తను రవిని దైవంలా పూజిస్తుంది!

# ప్రేమిస్తే ఏమౌతుంది?

సంసారంలో ఎటువంటి కలతలూ రావు. తమ తం ఆనందమయం అవుతుంది! తమ కిద్దరు లు చాలు! వాళ్లని తన అభిరుచుల కనుగుణంగా ంచుతుంది.

తానూ, రవీ, తన పిల్లలతో ఇల్లు ట్ హోమ్ అవుతుంది."

స్వాతి కలల్లో తేలిపోసాగింది.

* * *

"స్వాతీ! ఈ మధ్య అస్సలు మాటలే వయ్యావే!" అంది ఒకరోజు కళ్యాణి, నోటు క్సు దిద్దుకుంటూ!

"నువ్వు మాత్రం మాట్లాడుతున్నావా!" ంది స్వాతి.

"నా విషయం వదిలెయ్!"

"ఎందుకనో? అది సరేగానీ మొన్న స్కూటర్ ంద కన్పించావ్! ఎవరతను?"

"అతనా! నా కొత్త ఫ్రెండు శేషగిరిలే" ంది కళ్యాణి తేలిగ్గా.

స్వాతి ఆశ్చర్యపోతూ "కొత్త ఫ్రెండా!" ంది.

"అవునే! పెద్ద బిజినెస్ మేగ్నెట్! నేనాయన్ని ప్రేమిస్తున్నానే!"

"ఇంతకుముందు కూడా ఇంకో ఇద్దర్ని ఇలాగే ప్రేమిస్తున్నట్లు చెప్పిన గుర్తుంది. అవునా!"

దానికి కళ్యాణి నవ్వేస్తూ — "అవునే! వాళ్లని ప్రేమించాననుకున్నాను. కానీ నేను నిజంగా ప్రేమించేది ఇతన్నే"

"కొన్నాళ్లు పోయాక ఇంకో వ్యక్తి పేరు చెప్తావేమో!"

"ఏమో! చెప్పినాచెప్పొచ్చు" అంటూ బుక్కుల్లో చకచకా టిక్కులు పెట్టేస్తోంది.

కళ్యాణి ధోరణికి మండిపోయింది స్వాతి. "కళ్యాణీ! నీది ప్రేమ కాదే వ్యామోహం! డబ్బు మీది ఆశ! ఎవడు బాగా డబ్బున్నవాడిలా కన్పిస్తే వాడితో తిరుగుతావు. నీ వ్యామోహానికి ప్రేమనే పెద్ద మాట వాడి ఆ మాట విలువ కూడా పాడుచేస్తావెందుకే? ప్రేమ అనేది ఎంత మహత్తరమైనదో నీలాటివాళ్లకు తెలీదు."

కళ్యాణి నవ్వుతూ — "ఉపన్యాసం బాగానే వుంది. నీకు ప్రేమ గూర్చి చాలానే తెలుసన్న మాట" అంది.

కళ్యాణి తన మాటల్ని తేలిగ్గా తీసుకోవడంతో స్వాతి చిన్నబుచ్చుకుంది.

"నాకు తెలుసని అనలేదు! నిన్ను ఆ మాట అనొద్దంటున్నాను. అయినా కళ్యాణీ! నీ ప్రవర్తన నాకేం బాగాలేదు."

కళ్యాణి తలెత్తి స్వాతి వేపు చూసింది.

"స్వాతీ! ఇదివరకోసారి ఇటువంటి సందర్భమొస్తే చెప్పాను. మళ్లీ చెప్తున్నాను విను. నాకు డబ్బు కావాలి. అదిచ్చే సుఖాలు కావాలి! నాకు డబ్బు లేదు కానీ అందం వుంది. దానితో డబ్బు సంపాదిస్తున్నాను. నువ్వు నన్ను తిట్టినా, అసహ్యించుకున్నా నా పద్ధతి మార్చుకోలేను" అంది ఖచ్చితంగా.

కళ్యాణి కుటుంబ స్థితి తెలుసు. అందుకే కళ్యాణి మీద జాలి కలిగింది.

"కళ్యాణీ! ఒక్క సలహా విను! ఒక డబ్బున్నవాడిని చూసి పెళ్లి చేసుకుంటే ఏ బాధా వుండదు కదా!"

"ఈ సలహా బావుంది! నేనూ అదే చూస్తున్నాను. ప్రస్తుతం ఆ వేటలోనే వున్నాను" అంది కళ్యాణి.

బెల్ అయింది!

స్టాఫ్ రూమ్‌లోకి లెక్చరర్లు ఒకరొకరే రావడంతో స్వాతి మాటలు ఆపేసింది.

కళ్యాణి పూర్తిగా నాశనమవకముందే ఎవడైనా డబ్బున్నవాడు ముందుకు వచ్చి కళ్యాణిని చేసుకుంటే బాగుండునన్పించింది స్వాతికి

రవికి కళ్యాణి విషయం చెప్పాలి. ఏదైనా సలహా చెప్తాడేమో!

తన కళ్ల ఎదుటే తన స్నేహితురాలు నాశనమవుతూంటే తను చూస్తూ వూరుకోలేదు.

* * *

ఒకరోజు సాయంత్రం స్వాతి కాలేజీ నుండి వచ్చి వరండాలో కూర్చుని పుస్తకం చదువుకుంటోంది. గేటు చప్పుడయితే తలెత్తి చూసి ఆశ్చర్యపోయింది!

రాధ గేటు తీసుకుని వస్తోంది.

చటుక్కున కుర్చీలోంచి లేచి — "రండి ... రండి!" అంటూ ఆహ్వానించింది.

రాధ మెట్లెక్కి వరండాలోకి వచ్చింది.

రాధ ఒంటరిగా రావడం స్వాతికి వింతగా తోచింది. రాధవేపు చూసింది.

రాధ ముఖం ప్రసన్నంగాలేదు. ముఖంలో విచారం తొంగి చూస్తోంది. ఆ విశాలమైన కళ్ళల్లో బాధా, దిగులూ, భయం కన్పిస్తున్నాయి!

ఎందుకలా వుంది?

"కూర్చోండి!" అంది స్వాతి.

రాధ కూర్చుంది.

"ఒక్కరే వచ్చారా?"

"అవునండీ!"

"మా ఇల్లు తెలుసుకున్నారే?"

"రావాలనుకున్నప్పుడు తెలుసుకోవాలిగదా?" అంది రాధ.

"ఆహాఁ!" అంది స్వాతి.

క్షణం ఆగి స్వాతే అంది—"మీ అత్తయ్యగారు బావున్నారా? మళ్లీ మీ ఇంటికి రావాలనుకున్నాను! కానీ కాలేజీ వర్క్‌తో బిజీగా వుండటం వలన కుదరలేదు!"

రాధ ఏం మాట్లాడలేదు.

రాధ ఎందుకు వచ్చిందో తెలుసుకోవాలని ఆరాటంగా వుంది స్వాతికి.

రాధ చెప్పే మాట కోసం చూస్తోంది. అయిదు నిముషాలు గడిచాయి!

రాధ హఠాత్తుగా అంది — "మిమ్మల్నొక కోరిక కోరాలని వచ్చాను."

"ఏమిటో చెప్పండి?"

"రవి బావకూ, నాకూ పెళ్లయ్యేట్లు మీరు చూడాలి!" అంది రాధ.

ఆ మాట విని స్వాతి కొయ్యబారిపోయింది.

"స్వాతీ! రవి బావ మిమ్మల్నే చేసుకుంటానంటున్నాడు. రవి బావమీదే నేను చిన్నప్పట్నించీ ఆశలు పెట్టుకున్నాను. అతడే నా భర్త! అనుకుంటూ వచ్చాను. బావ నాకిప్పుడు వేరే పెళ్లి చేస్తానంటున్నాడు. కానీ నేను చేసుకోలేనండీ! బావని తప్ప ఇంకెవర్నీ చేసుకోలేను" ఆవేశంగా అంది రాధ.

"ఆ విషయం మీ బావతో చెప్పలేకపోయారా?" అనడిగింది స్వాతి.

ఆ మాటకి రాధ నవ్వింది!

"ప్రస్తుతం మా బావకి నాతో మాట్లాడ్డానికే తీరికలేదు. ఇక ఈ మాటలు వింటాడా? అక్కా!

## రేపటి భయాలు

మొన్న అవసరం లేనివి
నిన్న కనీస అవసరాలు కాగా,
నేడవే అత్యాసలౌతోంటే
రేపు ప్రాణాధారమైన
గాలినికూడా పైసాలు పెట్టి
కొనుక్కోవాలేమోనని భయం

మొన్నటి అలవాట్లు
నిన్నటి ఆచారాలు కాగా
నేడవి దురాచారాలుగా
పట్టి పీడిస్తూంటే
రేపింకా వాటికి ఎన్ని
జీవితాలు బలౌతాయోనని భయం

మొన్న ఊసుపోకకి పుట్టిన
కుల మతాలు
నిన్న మనుషుల మధ్య
చీలికలు తేగా
నేడు వాటిమత్తులో
కుత్తుకలు తెగుతూంటే
రేపీ తత్వం మనిషి
మనుగడనే మసి చేస్తుందేమోనని భయం

మొన్న, నిన్నటివారు
భయాల్నెదురొడ్డి పోరాడగా
నేడు వారి వారసులుగా
మిగిలిన మనం
భయాలకి బానిసలుగా
బ్రతుకుతూన్నాం
రేపటి ప్రపంచపు వార్‌లో
మరి మనకి వారసుల
మిగలరేమోనని భయం

— పి. మురళీధరరావ్

అనివార్య కారణాలవల్ల 'బొమ్మల భారతం' ఈ వారం పడలేదు. —సం:

మీరు చదువుకున్నవారు, నన్నర్థం చేసుకుంటారని మీ దగ్గిరికొచ్చాను.''

'అక్కా' అన్న రాధ పిలుపు స్వాతి హృదయాన్ని తాకింది.

"అక్కా ! నాకు అమ్మా, నాన్న చిన్నప్పుడే పోయారు. అత్తయ్య నన్ను పెంచింది. ఇన్నేళ్ళల్లోనూ నాకెప్పుడూ అమ్మా, నాన్న జ్ఞాపకం రాలేదంటే దానిక్కారణం అత్తయ్య ఆదరణ, బావ అభిమానం! చిన్నప్పుడు నేను సరిగ్గా చదవకపోతే చదువులేని పిల్లను చేసుకోను అనేవాడు బావ! ఎప్పుడైనా కొస్త విచారంగా కన్పిస్తే ఇలా ఏడుస్తూ వుంటే నిన్ను చేసుకోను అనేవాడు. బావ మాటలతో అతడే నా భర్త అనే భావం నాలో దృఢపడింది. మొన్న మొన్నటివరకూ కూడా రోజుకో గంటసేపైనా నాతో మాట్లాడందే నిద్రపోయేవాడు కాదు బావ! అటువంటిది ఈమధ్య పూర్తిగా మారిపోయాడు. రోజు మొత్తంమీద అయిదు క్షణాలు కూడా మాట్లాడ్డంలేదు.''

రాధ కంఠం రుద్ధమైంది! కళ్లమ్మట నీళ్ళు కారుతున్నాయి.

"అక్కా! ఇప్పుడు మీరే నాకు దిక్కు!'' అని స్వాతి కాళ్లమీద పడింది రాధ.

స్వాతి ఈ హఠాత్సంఘటనకు తడబడిపోయింది. క్షణకాలం ఏం చెయ్యాలో తోచలేదు! రాధ కన్నీళ్ళు పాదాల్ని అభిషేకిస్తున్నాయి!

స్వాతి గబుక్కున రాధని లేవనెత్తి — "రాధా! నీ బావ నీకు దక్కేట్టు చేస్తాను, సరేనా!'' అంది అప్రయత్నంగా.

ఆ మాటతో రాధ కళ్ళు మిలమిలా మెరిశాయి!

స్వాతి చేతులు పుచ్చుకొని కళ్ల కద్దుకుంటూ— "అక్కా! మీ గురించి బావ చెప్తూంటేనే అనుకున్నాను — మీరెంతో మంచివారని. అందుకే మీ దగ్గిరికిలా పరిగెట్టుకువచ్చాను. అమ్మయ్య! నా మనస్సు తేలికపడింది. అక్కా! మీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను.''

రాధ ఏదేదో చెప్తోంది.

స్వాతి ఆ మాటలు వినడంలేదు. రాయిలా కూర్చుంది.

రాధ లేచి నిలబడి — "అక్కా! చీకటి పడుతోంది! అత్తయ్యతో చెప్పకుండా వచ్చాను! వస్తాను'' అని వెళ్లిపోయింది.

స్వాతి అలాగే కూర్చుంది.

మనసంతా మొద్దుబారిపోయింది. అయిదు నిముషాలగ్గానీ ఆ షాక్‌నుండి తేరుకోలేకపోయింది.

జరిగిందంతా జ్ఞప్తికి వచ్చింది!

ఏమిటిది ?

ఎందుకిలా జరిగింది? రాధ కోరగానే తానెందుకు ఒప్పుకుంది? త్యాగాలు చెయ్యడానికి ఇదేం కథ కాదు కదా!

ఇది జీవితం!

ఇది తన దగ్గరున్న చీర ఇవ్వటం కాదు! తన దగ్గరున్న నగ ఇవ్వటం కాదు! మనసారా ప్రేమించిన వ్యక్తిని ఇవ్వటం!

రవిని వదిలి క్షణమైనా వుండలేదే! అటువంటిది అతనిని శాశ్వతంగా వదలుకోడమా! తనకది సాధ్యమేనా! ఎందుకలా మాట ఇచ్చింది! ఏ బలహీనత తననలా చేయించింది. తనమీద తనకే కోపం వచ్చింది, చిరాకు కల్గింది.

ఏం చెయ్యాలి ఇప్పుడు ?

యుగయుగాల్నించి ప్రేమకథలు ఇలాగే అంతమవుతున్నాయి.

ప్రేమించిన వాళ్ళు సుఖపడటంలేదు!

తన కథ వేరుగా వుంటుందనుకుంది! కానీ తనదీ అంతేనా!

రవితో పరిచయమై ఆరునెలలే అయినా తమది ఎన్నాళ్ల బంధమో అన్పిస్తోంది!

రవి తియ్యని మాటలు ఇక తను వినలేదు! అతని కళ్లల్లోని మెరుపుని చూడలేదు!

దుఃఖమూ, బాధా మనసుని పెనవేశాయి!

ఆత్మహత్య చేసుకుంటే! కాని తనమీదే ఆశలు పెట్టుకున్న అమ్మా, నాన్నగారు ఏమౌతారు?

బ్రతికుంటే ఈ చిత్రహింస ఎలా భరించడం?

మనుషుల మధ్య ఇటువంటి అనుబంధాలెందుకేర్పడతాయో!

భగవంతుడు తనకెటువంటి పరిస్థితి కల్పించాడు! రాధ వచ్చి తనను ఇలా అడిగే పరిస్థితి వస్తుందని వూహించివుంటే రవితో తనీ అనుబంధాన్ని పెంచుకునేది కాదు!

ప్చ్! ఇప్పుడు ఎన్ని అనుకుని ఏం లాభం!

తన కాపురాన్ని గూర్చి ఎంతో వూహించుకుంది! అవన్నీ కలలుగానే మిగిలిపోయాయి! ఇప్పటివరకూ తనెంతో అదృష్టవంతురాల్నని మురిసిపోయింది!

కానీ లోకంలో తనలాటి దురదృష్టవంతురాలు లేదని ఇప్పుడే తెలుసుకుంది.

ఆలోచనలతో తల వేడెక్కిపోయింది! మనసు అలిసిపోయింది! కుర్చీలో వెనక్కి ఆనుకుని కూర్చుంది! అలా ఎంతసేపు కూర్చుందో?

"అమ్మా! స్వాతీ! అలా చీకట్లో కూర్చున్నావేమ్మా?''

గోవిందరావు వాకింగ్ నుంచి వచ్చి వరండాలో కూర్చున్న స్వాతిని చూసి అన్నాడు.

స్వాతి తండ్రి గొంతు విని సర్దుకు కూర్చుంది.

"అలావున్నావేమ్మా ?''

స్వాతి లేని నవ్వు తెచ్చుకుని — "ఏం లేదు నాన్నా!'' అంది.

దిగాలుగా వున్న స్వాతిని చూశాక స్వాతికి త్వరగా పెళ్లి చేయాలన్పించింది. ఇప్పటికే ఆలస్యం చేసి పొరపాటు చేశాడు ఈ వయస్సులో ఆడపిల్లలకి తోడు అవసరం.

"అమ్మా స్వాతీ! అన్నయ్యకు ఏమని వుత్తరం రాయమన్నావు ?''

స్వాతి మనస్సులో అన్నయ్య వ్రాసిన వుత్తరం మెదిలింది.

'స్వాతికి ఇక్కడో మంచి సంబంధం చూశాను. నేను వారం రోజుల్లో అక్కడికి వస్తాను. వచ్చేటప్పుడు కుర్రాడిని కూడా తీసుకువస్తాను. ఏ సంగతీ వ్రాయండి!' అని వ్రాశాడు.

వుత్తరం వచ్చి రెండ్రోజులయింది!

తండ్రి ఈ విషయం ప్రస్తావిస్తే రవిని గూర్చి చెప్దామనుకుంది స్వాతి

తండ్రి అడిగాడు!

కాని...

"ఏమ్మా! మాట్లాడవే? నిన్నడిగి వ్రాయాలని ఆగాను.''

"నీ ఇష్టం నాన్నా!'' అని లోపలికెళ్లిపోయింది.

'పిచ్చితల్లి! ఆడపిల్ల ఇంతకన్నా ఏం చెప్తుంది? రేపే రెండోవాడికి వుత్తరం వ్రాయాలి' అని అనుకున్నాడాయన.

(ఇంకా ఉంది)






సుఖదుఃఖాల్ని నిర్వికారంగా స్వీకరించడానికి – సర్వ సంగపరిత్యాగేం కాదు సుబ్రహ్మణ్యం.

ఎంత హుషారుగా సిటీ బస్సెక్కాడో, దిగిం తరవాత అంతగానూ దిగాలు పడిపోయాడు

అదీ – ఐదు నిముషాల వ్యవధిలో ...

అసలే అంతంత మాత్రం ఆరోగ్యం. ఆపైన లంఖణాలు చేసినవాడిలా, నీరసంగా ఇంటికొచ్చిన భర్తని చూసి కంగారు పడిపోయింది కాంతం.

"ఏవిటి అలా ఉన్నారు?" అడిగింది ఆత్రుతగా.

"..............."

"మాట్లాడరేవిటి!"

"..............."

"మీ ఆఫీసరేవన్నా అన్నాడా ?"

"ఇబ్బే ! అదేంకాదు."

"మరేవిటి చెప్పండి !"

"జేబులో పర్సు కొట్టేశారెవరో" అప్పటికి మాట్లాడాడు సుబ్రహ్మణ్యం.

"ఎంతుంది అందులో" కాంతం మాటల్లో వణుకొచ్చేస్తోంది.

"ఈరోజు తీసుకున్న ఐదువందలు అందులోనే ఉన్నాయి."

డబ్బుపోయిందన్న ఉదుకుమోత్తనం ఆపుకోలేక పెద్దగా ఏడ్చేసింది కాంతం. ఆరువాటాలున్న లొద్దెయిల్లది. ఏడుపు విని ఏవైందో అన్న కంగారుతో చూడ్డానికొచ్చారు – పక్కింటి పిన్నిగారు, ఆవిడ భర్త.

"ఏడుపు ఆపు – పెద్ద గొంతేసుకొని" విసుక్కున్నాడు సుబ్రహ్మణ్యం.

"ఏం జరిగిందమ్మా కాంతం !" అంటూ పక్కన చతికలబడింది పక్కింటి పిన్నిగారు.

"ఆయన జేబులో డబ్బు ఐదొందలు పోయిందండోయ్ పిన్నిగారు !" మళ్ళీ బావురుమంది కాంతం.

"ఏవిటోయ్ సుబ్రహ్మణ్యం" నిజవేనా అన్నట్టుగా చూసారు పిన్నిగారి భర్త.

"మరేనండీ !"

"అసలెలాపోయింది ?"

"సిటీబస్‌లో కొట్టేశారు."

"పోలీస్ రిపోర్టిచ్చిరా !– ఎందుకైనా మంచిది" సలహా యిచ్చేరు పిన్నిగారి భర్త.

ఆ సలహా తక్షణ కర్తవ్యంగా తోచింది సుబ్రహ్మణ్యానికి. రిపోర్టివ్వడానికి పోలీస్ స్టేషన్‌కి వెళ్ళేడు.

ఏవిటో – ఖర్మ కాకపోతే, రోజూ రిక్షా ఎక్కే తనకి ఈరోజే సిటీబస్సెక్కాలనిపించాలా. ఒకటా, రెండా – ఐదు వందలు. నెల్లాళ్ళ క్రితం 'లోన్'కి దరఖాస్తు పెడితే యిప్పటికి వచ్చింది. ఆ డబ్బు మీద తను ఎన్నో ఆశలు పెట్టుకున్నాడు. ఆడపిల్లిలిద్దరికీ ఓ జత గౌనులు, తనకో పేంటు, షర్టూ తీసుకోవాలనుకున్నాడు. ఇందులోనే, బావమరిది దగ్గర తీసుకున్న ఏందా తిరిగి యివ్వాలి. ముఖ్యంగా రేపు తండ్రి ఆబ్దీకం ఖర్చు కూడా దీంట్లోనే సరిపెట్టుకోవాల్సుంది. ఇప్పుడెలా ? భగవంతుడి దయవల్ల పోయిన పర్సు దొరికితే —

"నడిపెడతన్నారేటండి బాబూ! రిక్షా ఎక్కండి" అలవాటయిన రిక్షావాడి పిలుపుతో సుబ్రహ్మణ్యం ఆలోచనలు చెదిరిపోయాయి.

"వద్దులేరా !" అనేసి ఎదురుగా కనిపిస్తున్న పోలీస్‌స్టేషన్ గుమ్మం ఎక్కాడు.

"నా పర్సు పోయింది – రిపోర్టివ్వడానికి వచ్చాను" అన్నాడు సుబ్రహ్మణ్యం.

మధ్యాహ్నం భోజనానికి వెళ్ళినట్టున్నాడు – సబ్‌యినస్పెక్టర్ కుర్చీ కాళీగా ఉంది.

వచ్చిన మనిషికేసి చూసాడు హెడ్‌కానిస్టేబుల్. ఈ మాటలు వినడం మాకేవీ కొత్తకాదు అన్నట్టుగా ఉంది ఆ చూపు.

"వివరాలు చెప్పండి" అంటూ అలవాటయిన ధోరణిలో కాగితం, పెన్నూ తీసాడు.

"నా పేరు సుబ్రహ్మణ్యం" చెప్పేడు.

"ఏం పని చేస్తూంటారు ?"

"గవర్నమెంటు ఆఫీసులో యు. డి. క్లర్కు".

"పోయిన డబ్బెంత ?"

"ఐదు వందలు."

"విడి నోట్లా ? వందకాయితాలా ?"

# మరింత మేలైన జీవనాన్ని సాగించేందుకు మీరు సంసిద్ధులయిఉన్నారా



మీ ఇంటి గురించి కాస్త ఆలోచించండి. మీ జీవితం మరింత చక్కగా హాయిగా గడిపేందుకు ఏవో కొన్ని వస్తువులు కొనుక్కోవాలనే కోరిక ఉండోచ్చు మీకు. అవి టివి సెట్, స్టీరియో సిస్టమ్ కావచ్చు. రిఫ్రిజిరేటర్ లేక చేక్ ఒవెన్ కావచ్చు. మిక్సర్ లేక కుట్టు మిషన్ కావచ్చు. అయితే మీ దగ్గర తగినంత డబ్బుగానీ లేకపోతే మీరు చాలా వస్తువులు కొనుక్కోలేరు మరి. అంచేత ముందు డబ్బు సంపాదించేందుకు పథకం వేయాలి మీరు.

ముందు ఆ డబ్బు ఎలా వస్తుందన్నదాని గురించి ఆలోచించండి. బ్యాంక్‌కి వెళ్ళి మీ అవసరాలకు అనువుగా రూపొంచబడిన ఓ పథకాన్ని ఎన్నుకొని పొదుపు చేస్తే ఆ డబ్బు సంపాదించే అవకాశం ఉంటుంది. అక్కడ మీ డబ్బు భద్రంగా, సురక్షితంగా త్వరగా పెరుగుతుంది. మీరు కోరుకునే జీవన రీతికి కావలసిన వాటిని కొనుక్కునేందుకు తోడ్పడుతుంది. అందుకే ఇప్పట్నుంచే పొదుపు చేయడం మొదలెట్టండి. 30,000కు పైగా బ్రాంచీలు గల ప్రభుత్వ యాజమాన్య బ్యాంక్ యొక్క ఏ బ్రాంచ్‌లోనైనా సరే పొదుపు చేయండి—మీకోసం,మీ ఇంటికోసం.



జాయింట్
పబ్లిసిటీ కమిటీ
ప్రభుత్వ యాజమాన్య
బ్యాంక్‌లు

మెంబర్ బ్యాంక్‌లు

అలహాబాద్ బ్యాంక్ • ఆంధ్రా బ్యాంక్ • బ్యాంక్ ఆఫ్ బరోడా • బ్యాంక్ ఆఫ్ ఇండియా • బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర • కెనరా బ్యాంక్
సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా • కార్పొరేషన్ బ్యాంక్ • దేనా బ్యాంక్ • ఇండియన్ బ్యాంక్ • ఇండియన్ ఓవర్‌సీస్ బ్యాంక్ • న్యూ బ్యాంక్ ఆఫ్ ఇండియా
ఓరియంటల్ బ్యాంక్ ఆఫ్ కామర్స్ • పంజాబ్ నేషనల్ బ్యాంక్ • పంజాబ్ & సింద్ బ్యాంక్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా
స్టేట్ బ్యాంక్ ఆఫ్ బికనీర్ & జైపూర్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండోర్ • స్టేట్ బ్యాంక్ ఆఫ్ మైసూర్
స్టేట్ బ్యాంక్ ఆఫ్ పాటియాలా • స్టేట్ బ్యాంక్ ఆఫ్ సౌరాష్ట్ర • స్టేట్ బ్యాంక్ ఆఫ్ ట్రివాన్కూర్ • సిండికేట్ బ్యాంక్
యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా • యునైటెడ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా • యునైటెడ్ కమర్షియల్ బ్యాంక్ • విజయా బ్యాంక్.

**ప్రభుత్వ యాజమాన్య బ్యాంక్‌లు–మీ దైనందిన జీవితంలో ఎడతెగని బంధం, అనుక్షణం.**

Imageads-JPC-80312 C TL

# నిర్ణయం

"అన్నీ వందకాయితాలే."

"ఎప్పుడు పోయింది ?"

"ఈ రోజే... సుమారు ఒంటిగంటన్నర అయ్యుంటుంది."

"ఎక్కడ పోయింది ?"

"సిటీబస్సెక్కేముందు ఉంది — దిగింతరవాత చూసుకుంటే లేదు."

"ఈ కింద సంతకం పెట్టండి" కాయితం సుబ్రహ్మణ్యం ముందుకి తోసాడు హెడ్‌కానిస్టేబుల్.

ఓసారి చదువుకుని సంతకం చేసి యిచ్చేశాడు.

"రేపోసారి కనిపించండి ! వివరాలేవన్నా తెలిస్తే చెపుతాం" మళ్ళీ తనే అన్నాడు హెడ్‌కానిస్టేబుల్.

అలాగే అన్నట్టుగా తలూపి పోలీస్‌స్టేషన్ నుంచి బయటపడ్డాడు సుబ్రహ్మణ్యం.

*　　*　　*

ఏదో ఒకటి చెయ్యాలి...

సబ్‌యినస్పెక్టర్ సత్యం తన సీట్లో అసహనంగా కదిలేడు. జరిగింది తల్చుకొనేకొద్దీ, అతనిలో ఆవేశం ఎక్కువవుతోంది...

అసలిలా జరగడానికి అవకాశం ఎక్కడ దొరికింది? బహుశా—తను వస్తూండగా, రోడ్డుమీద కొట్లాడుతుంటున్న గుంపుని ఆపడానికి వెళ్ళినప్పుడు జరిగుండొచ్చు. ఇంతవరకూ తన సర్వీసులో ఇలా జరగలేదు. తన జేబులో పర్సు కొట్టేయడవా ... అదీ డ్యూటీలో ఉండగా ... ఇది పోలీస్ వృత్తికే అవమానం పైగా తనకో సవాల్ లాంటిది. తప్పదు ... ఏదో ఒకటి చెయ్యాలి —

"పరమేశం" పిల్చాననుకున్నాడు. కాని గట్టిగా అరిచేడు.

"యస్ సార్ !" సెల్యూట్ చేసి నిలబడ్డాడు హెడ్ కానిస్టేబుల్ — పరమేశం.

"మన ఏరియాలో మొత్తం జేబుదొంగల లిస్ట్ ఉందా ?"

"ఉంది సార్ !"

"ఆ ఫైలు పట్రా !"

"ఎందుకు సార్ ? ఎవరైనా రిపోర్టిచ్చారా ? అయినా — తిరిగేప్పుడు వళ్ళుపై తెలియకుండా తిరగడం; ఆపైన డబ్బు పోయిందంటూ మన మొహాన్ని ఓ కాయితం రాసి పడేయడం. ఇంతకీ రిపోర్టించ్చిందెవరు సార్ !"

"పోయింది నా పర్సేనయ్యా" హెడ్ కానిస్టేబుల్ని మింగేసేలా చూస్తూ అన్నాడు ఇనస్పెక్టరు.

అదిరిపడ్డాడు హెడ్ కానిస్టేబుల్.

ఎదురు దెబ్బ తగిలిందే ... తను అనవసరంగా వాగడు. ఊరుకున్నాబాగుండిపోయేది. తను మాత్రం కలగన్నాడా — పోయింది ఆయన పర్సేనని. ఇప్పుడేవిటి చెయ్యడం ? క్షణంలో ఓ నిర్ణయానికి వచ్చేసేడు.

"క్షమించండి సార్ ! పొరపాటయింది. పర్సులో ఏ మాత్రం డబ్బుందిసార్ !" వినయంగా అడిగేడు.

"నాలుగు వందకాయితాలు, ఇంకా చిల్లర నోట్లు ఓ యిరవయి దాకా ఉండాలి"

"ఈ మాత్రానికి మీ రెందుకు సార్ ! నాకో అవకాశం యివ్వండి. మీ డబ్బు చేతికొచ్చేలా చేస్తాను.,

హెడ్ కానిస్టేబుల్ మాటలు — ఇనస్పెక్టరు సత్యం ఆవేశం మీద నీళ్ళుచల్లి ఆలోచనల్ని రేకెత్తించేలా చేసాయి.

అవును — పరమేశం అన్నంత పనీ చెయ్యగల్డు. తనకున్నా ముందునుంచీ యిక్కడే ఉంటున్నాడు. తనొచ్చి యింకా ఆర్నెల్లయినా కాలేదు. ఇక్కడి జేబుదొంగల సంగతి తనకన్నా పరమేశానికే బాగా తెలుసు. రేపు భార్య పుట్టింటి ప్రయాణానికని, పొద్దున్నే బ్యాంక్‌లోంచి తెచ్చాడు తను. ముందు డబ్బు చేతికొచ్చేస్తే, మిగతా విషయాలు తర్వాత చూడొచ్చు —

"సరే ! ముందు నువ్వాపని చూడు. రాత్రి పది గంటలదాకా నేను స్టేషన్‌లోనే ఉంటా. అంతకీ కాకపోతే, అప్పుడే చూపిస్తా నా సత్తా ఏవిటో" పట్టుదలగా అన్నాడు యినస్పెక్టరు సత్యం.

*　　*　　*

ముత్యాలుగాడ్ని పట్టుకోవాలి...



తప్పదు — తను యినస్పెక్టర్ కిచ్చిన మాట నిలబెట్టుకోవాలంటే, వాడ్ని కలుసుకుతీరాలి. వాడే ఈ ఏరియాలో జేబుదొంగలకి నాయకుడు.

పట్టువదలని విక్రమార్కుడిలా — అప్పటికి నాలుగ్గంటలనుంచీ వెతుకుతున్నాడు హెడ్‌కానిస్టేబుల్. చివరికి రాత్రి ఎనిమిదయిం తరవాత ముత్యాల్ని వాడి యింటిదగ్గర కలుసుకో గలిగాడు.

హెడ్‌కానిస్టేబుల్ని చూడగానే, మందు కొట్టడానికని ముందు పెట్టుకున్న సరంజామానంతా పక్కకి సర్దేశాడు ముత్యాలు.

"ఈ యదవ మర్యాదలకేంలే" కోపంగా అన్నాడు హెడ్‌కానిస్టేబుల్.

"హేడ్‌గారు మంచి కాకలో ఉన్నట్టున్నారు. సంగతేటి ?" అంటూ నవ్వాడు ముత్యాలు.

"ఏరా ! మీరు మా జేబులుకూడా కొట్టేసే స్టేజీ కొచ్చారన్నమాట."

"మీరంనేది ఏవిటో నా కర్థం కావటంలేదు."

"ఎల్లా అవుద్ది అర్థం... ఈ వేళ మధ్యాహ్నం మా ఎస్. ఐ గారి పర్సు కొట్టేశారు మీవాళ్ళు. ఇంత ధైర్యం ఎలా వొచ్చిందిరా మీకు ?" దబాయించి అడిగేడు హెడ్‌కానిస్టేబుల్.

"ఇయ్యాల అసలు మావోళ్ళకి చిక్కిందే ఒక పర్సు. అదీ సిటీబస్‌లో. ఆ తర్వాత మళ్ళీ బోణీ లేదు. నన్ను నమ్మండి" అన్నాడు ముత్యాలు.

"ఇవ్వన్నీ నా కనవసరం. అవతల ఆయన మండిపడిపోతున్నాడు. ఆయన పర్సులో నాలుగొందల యిరవై రూపాయలుండాలి. మర్యాదగా యిచ్చారా సరి; లేకపోతే చువ్వల్లెక్కెడుతూ కూర్చోవాలి."

"మీరలా అంటే ఇంక చేసేదేవుందీ. ఆ పర్సులో ఉన్న ఐదొందల్లోది యిస్తాలి. మరి లేని పర్సు ఎక్కడ్నించొస్తాది."

"అయ్యన్నీ నాకొదిలిపెట్టి ముందు డబ్బు తియ్యి."

"ఈ రోజు బాగోలేదు. వచ్చిందనుకున్నది కూడా పోతోంది" సణుక్కుంటూ డబ్బిచ్చాడు ముత్యాలు.

డబ్బు తీసుకొని, ముత్యాల్ని మరోసారి హెచ్చరించి స్టేషన్ కొచ్చాడు — హెడ్‌కానిస్టేబుల్.

"ఏమైంది ?" అడిగేడు యినస్పెక్టర్...

"యదవల్ని తన్ని మరీ తెచ్చానుసార్ డబ్బు" అంటూ నోట్లు టేబుల్ మీద పెట్టాడు హెడ్‌కానిస్టేబుల్.

"మరి పర్సేదీ ?"

"గుర్తు దొరుకుతుందేమోనని, పర్సెక్కడో పారేశార్ట సార్ ! యదవలు."

"ఓ. కే. మిగతా విషయాలు రేపు చూద్దాం" అంటూ ఇంటికి వెళ్ళడానికి లేచాడు యినస్పెక్టర్ సత్యం.

*　　*　　*

"కొత్త కేసు లేవన్నా వచ్చాయా — ఆలస్యంగా వచ్చారు" అడిగింది యినస్పెక్టర్ భార్య.

"కొత్త కేసేం కాదు — స్వంత కేసే. ఎవడో దొంగరాస్కెల్ నా పర్సే కొట్టేశాడు" చెప్పేడు డ్రస్ మార్చుకుంటూ.

"మీ పర్సు పోవడం ఏవిటి ? ఇంట్లోనే ఉందిగా" అని భర్తవైపు ఆశ్చర్యంగా చూసింది.

"ఇంట్లోనే ఉందా !" ఈసారి తను కూడా ఆశ్చర్యపోయాడు యినస్పెక్టర్.

"అవును — మధ్యాహ్నం మీరు యింటి కొచ్చినప్పుడు మీ జేబులోంచి కిందపడింది. తీసి డ్రాయర్లో పెట్టాను. అప్పుడు చెప్పడం మర్చిపోయాను."

"అలాగ !" సాలోచనగా అన్నాడు యినస్పెక్టర్ సత్యం.

మరి హెడ్‌కానిస్టేబుల్ ఎలా తేగలిగాడు ఈ డబ్బు ? ఆలోచిస్తున్న యినస్పెక్టర్‌కి, మధ్యాహ్నంస్టేషన్‌లో తను చూసిన సుబ్రహ్మణ్యం రిపోర్టు గుర్తొచ్చింది. తన ఏరియాలో ఈరోజు అదొక్కటే పిక్‌పాకెట్ కేసు. యస్... అలాగే జరిగుంటుంది. ఇప్పుడు తనేంచెయ్యాలి ?...

వ్యక్తిగత గౌరవం — వృత్తిగత నిజాయితీ, ధర్మకాటాకి రెండువైపులా సమానంగా తూగుతూ, తన నిర్ణయంకోసం ఎదురుచూస్తూ కనిపించాయి— సబ్‌యినస్పెక్టర్ సత్యానికి. ★




"జయంతీ! త్వరగా బయలుదేరండమ్మా! అప్పుడే చీకటిపడి పోతోంది." వంటింట్లోంచి బిగ్గరగా అంది మీనాక్షమ్మ.

"నేను రడీ! నీదే ఆలస్యం జయూ!" అంది జయంతి చెల్లెలు లత.

"నా ఆలస్యం కూడా ఏం లేదు. పద వచ్చేస్తున్నాను." టేబులు పైన వున్న కుంకుమభరిణ చేతులలోకి తీసుకుంటూ అంది జయంతి.

"అదేమిటే జయా! పేరంటం పిలవడానికి ఆ భరిణె ఏం బాగుంటుంది. ఒక్క నిమిషం వుండు" అంటూ బీరువాలోంచి వెండి కుంకుమభరిణె తీసుకువచ్చి జయంతి చేతులలో పెట్టింది మీనాక్షమ్మ.

ఇద్దరూ బయలుదేరబోతూంటే పని ముగించుకు వచ్చిన వాళ్ళ పనిమనిషి కుంకుమ భరిణె చూచి "చాలా బాగుందమ్మగారు" అంది వాళ్ళ దగ్గరగా వచ్చి.

"అలాగా!" అంటూ జయంతి చేతులలో నుంచి కుంకుమ భరిణె తీసి పనిపిల్లకు అందించింది లత. కాసేపు కన్ని రెప్ప వెయ్యకుండా చూచి, "భలే బాగుందమ్మగారు!" మళ్ళీ అంది పనిపిల్ల.

పన్నెండేళ్ళునిండని దాని కళ్ళకు అన్ని వస్తువులూ ఎంతో వింతగా కనిపిస్తాయి. కంటికి నచ్చిన ఏ వస్తువైనా మరీ మరీ చూడాలని, ముచ్చటగా చేతులలోకి తీసుకోవాలని ఉబలాట పడుతోంది దాని పసి హృదయం. సంస్కారం పాలు కాస్త ఎక్కువగా ఉన్న లతకు తెలుసు దాని మనస్సు. అందుకే భరిణె దాని చేతులలో పెట్టి కాస్సేపు ముచ్చటలాడుతోంది. "లక్ష్మి,మూత తీసి భరిణెలోని కుంకుమతో నాకు బొట్టు పెట్టు" అన్న లత మాటలకు చెంగున గంతేసింది లక్ష్మి. అది లత నుదుట బొట్టు పెడుతోంటే చూసిన మీనాక్షమ్మకు ఒళ్ళు మండింది.

"పనిపిల్లతో ఏమిటా ముచ్చట్లు. హద్దూ పద్దూ వుండక్కర్లే." మీనాక్షమ్మ మాటకు బెదురు చూపులు చూస్తూ నెమ్మదిగా కుంకుమభరిణె లత చేతిలో పెట్టేసి వెళ్ళిపోయింది లక్ష్మి.

పేరంటానికి పిలవటానికి వెళ్ళిన లత మనస్సులో ఆ సంఘటనే మెదులుతోంది. అమ్మ కేకలకు లక్ష్మి ఎంత బెదిరిపోయిందో

పాపం! లక్ష్మిపట్ల సానుభూతితో వుండి పోయింది లత మనస్సు.

మరునాడు జయంతి కొడుకు పుట్టిన రోజు. ఇల్లంతా హడావిడిగా వుంది. పేరంటానికి వచ్చిన వాళ్లందకి ఆ వెండిభరిణెలోని కుంకుమ బొట్టు పెడు తుంటే లక్ష్మి గుర్తుకువచ్చి బాధగా అనిపిం చింది. అమ్మ ఒక్క కసురు కసరగానే బెదిరి పోయింది పిచ్చిపిల్ల. మరి తనవైపుకే రాలేదు. భరిణె కాస్సేపు దాని చేతులలో వుంటే ఏమైపోతుంది. ఏమిటో ఈతత్వాలు. అది పనిమనిషి అయినంత మాత్రాన అంత చులకనగా చూడాలా. ఆలోచిస్తూనే వుంది లత.

అక్కయ్య ఊరు వెళ్లిపోవటం, తనకు కాలేజీ తెరచేయటం జరిగిపోయినా ఆ సంఘటన మాత్రము మరచిపోలేక పోయింది లత. లక్ష్మి ఎప్పటిలా పనిచేసుకు పోతోంది. ఆ రోజు లత కాలేజీ నుంచి వచ్చేసరికి మీనాక్షి దేనికోసమో వెతుకుతోంది. లతని చూస్తూనే "వెండి కుంకుమభరిణె ఎక్కడ పెట్టావు!" కాస్త చికాకుగా అంది. లత ఉలిక్కిపడింది. "పేరంటం అయిపోయాక టేబిలుమీదనే పెట్టేసాను. ఈ నాలుగురోజు లుగా దాన్ని మళ్లీ నేను చూడలేదు." అంది.

"గంటసేపటి నుంచి వెతికి చస్తున్నా. అన్నీ ఉన్నాయికాని ఈ భరిణె కనిపించడం లేదు. ఎక్కడ పెట్టేవో కాస్త గుర్తు తెచ్చుకో."

మీనాక్షమ్మ మాటలకు ఏదో గుర్తు వచ్చిన దానిలా లత అంది. "అక్కయ్య ఊరెళ్లిపోయేరోజు నానిగాడు ఆ భరిణెతో ఆడుకోవడం చూసేను. ఎక్కడ పడేసేడో ఏమో !"

"బాగుందే నీ మాట. ఆ పసి నాగన్న ఏం చేస్తాడు. ఇది ఆ లక్ష్మి పనే అయి ఉంటుంది. నువ్వు ఆరోజే కుంకుమభరిణె ఇచ్చి దానితో ముచ్చటలాడినప్పుడే అను కున్నాను. ఇలాటిదేదో జరుగుతుందని. రేపు రానీ ! దాని పని చెబుతా."

లత అదిరిపడింది. లక్ష్మి అంటే లతకి ఎంతో నమ్మకం. అది ఇలాటి పని ఎప్పుడూ చేయదు. ఉత్త అమాయకురాలు. అమ్మ దాన్ని ఏమంటుందో ఏమో ! ఆలోచిస్తూ లత తల్లితో అంది— "అది అలాటి కాదమ్మా! మనమే జాగ్రత్తగా చూస్తే ఇంట్లోనే దొరుకుతుంది. అనవసరంగా దాని నెందుకు అనడం !"

"చాలా బాగుందే నీ ఉపన్యాసం. అసలు నేను అప్పుడే చెప్పేను. అయినా వెండిభరిణె దాని చేతులలో పెట్టడమేమిటి ! వాళ్ళ తక్కువ బుద్ధులు ఎక్కడికి పోతాయి ! గట్టిగా దబాయించి, నాలుగు అంటిస్తేసరి. చచ్చినట్లు అదే ఇచ్చేస్తుంది." అంటూ వంటింట్లోకి వెళ్లిపోయింది.

"అమ్మో ! అమ్మ అన్నంతపనీచేస్తుంది. నిజంగా ఉత్త అమాయకురాలు లక్ష్మి" ఒక్క క్షణం దాని రూపం దీనంగా లత కళ్ళల్లో మెదిలింది.

నేనలాటి పని చెయ్యలేదని కడివెడు కన్నీళతో అంది. అమ్మను బ్రతిమాలుతున్నట్లు అనిపించింది. లక్ష్మి మంచితనంమీదనమ్మకం, దానిమీద అభిమానం లతను ఎంతోసేపు భరిణెకోసం ఇల్లంతా వెతికేటట్లు చేసేయి. ఫలితం లేదు, అనిపించినా లక్ష్మిమీద నమ్మకం మాత్రం సడలిపోలేదు లతకు. భరిణె ఏమైఉంటుందో! తను ఊహించ లేదుకాని, లక్ష్మి దాన్ని తీసుకోలేదని మాత్రం చెప్పగలదు. కాని తను ఎంత చెప్పినా ఎవరు వింటారు! లక్ష్మి పనిలోకి రాగానే మీనా క్షమ్మ దాన్ని భరిణె గురించి అడిగేసింది ఖచ్చితంగా నువ్వే తీసావని దండించడం మొదలు పెట్టింది. అమ్మ దానిమీదకోపంతో అగ్నిలా మండిపోతోంది. దాన్ని ఎన్నెన్ని మాటలంటోందో లత మనస్సులో ఒక్కొక్క టిగా బాధను కలిగిస్తున్నాయి. నిప్పుకు గాలి తోడయినట్లు అమ్మకు అన్నయ్య లిద్దరూ తోడై లక్ష్మిమీద చెయ్యి కూడా చేసు కున్నారు. ఇక సహించలేక బయటికి వచ్చింది లత. లతను చూసేసరికి లక్ష్మికి దుఃఖం పొంగి వచ్చింది.

"లతమ్మగారూ! మీరేనా చెప్పండి! నేను ఆ భరిణె తీయలేదని. నేను దొంగని కానమ్మా! నిజంగా చెబుతున్నా. నేను దొంగని కాను." వెక్కిళ్ళ మధ్యగా ఇవే మాటలం టోంది లక్ష్మి.

లత ఆ దృశ్యం చూడలేక పోయింది. అసలు వీళ్ళంతా మనుష్యులేనా! అనిపించింది ఆ క్షణాన ఆమెకు.

"ఇక్కడెందుకు ఏడుస్తావు. వెళ్లి భరిణె తీసుకురా!" అంటూ లక్ష్మిని వీధిలోకి నెట్టేసి తలుపు మూసేడు పెద్దన్నయ్య. లత మనస్సు భారంగా వుంది. కాలేజీకి వెళ్లినా లక్ష్మి తనమనసులో మెదులుతోంది. అమ్మా,



# కుంకుమ భరిణె

అన్నయ్యా నిజంగా రాక్షసులలాగే ప్రవర్తించేరు. అది కూడా మనిషేనని మరచిపోయారు. అన్యాయంగా దాన్ని హింసించేరు. అమ్మ లక్ష్మిని పని మానిపించేస్తే దాని అమ్మా, అయ్యాకూడా దాన్ని ఏమంటారో!

తళతళా మెరిసే వెండి భరిణె చూస్తే దానికి ముచ్చట వేసింది. అంతేకాని దాన్ని దొంగిలించాలనే ఊహ దానికెందుకు వుంటుంది. ఆ భరిణె దాని చేతిలో వుంచి దానిచేత తను కుంకుమ బొట్టు పెట్టించుకున్నప్పుడు దాని కళ్ళు ఎంత ఆనందంతో మెరిసాయి. ఆ ముఖంలో దానికున్న కోరికేదో తీరిపోయిన సంతృప్తి ప్రస్ఫుటించలేదూ! కుంకుమభరిణె చూసి సరదాపడినంతమాత్రాన అది కనిపించకపోయేసరికి లక్ష్మే దొంగిలించిందనటం సబబుకాదు.

అమ్మా, అన్నయ్యలతో యెంతగానో వాదన పెట్టుకుంది. మనసు వుండబట్టక విషయం అంతా అక్కయ్యకు రాసింది. నాలుగు రోజుల తరువాత అక్కయ్య దగ్గర నుంచి అమ్మపేర వచ్చింది ఉత్తరం. ఆ ఉత్తరం చూసేసరికి మండుటెండల్లో బీటలు వారిన పుడమి మీద తొలకరి జల్లు కురిసినట్లు, మనస్సులకు ఆహ్లాదం కలిగించే మలయ మారుతం మరీ మరీ గిలిగింతలు పెట్టినట్టు, అందమైన వీణపై మరింత అందమైన అంగుళులు కదలి మధురస్వరాలు పలికినట్టు, మరెన్నో కమ్మ కమ్మని అనుభూతులు మేళవించి, లతను అలరించింది. తను ఊహించినది నిజమే-లక్ష్మి దొంగ కాదు —లక్ష్మి పేదదైనంత మాత్రాన, కులం తక్కువయినంత మాత్రాన ఇష్టంవచ్చినట్టు అంచనా వేసుకోవడమే! ఇదేనా ఉత్తమ సంస్కారం! ఈ మాటలు అమ్మా, అన్నయ్యలతో అని తనేదో ఘనవిజయం సాధించినట్టు సంబరపడిపోయింది మీనాక్షమ్మకైతే లక్ష్మితో జరిగిన విషయం చెప్పి మళ్ళీ పనిల్లో చేర్చుకోవటానికి అభిమానం అడ్డు వచ్చింది కాని, నానిగాడు ఆటసామానులతోపాటు వెండి భరిణె తీసుకు వెళ్ళిపోయాడని అక్కయ్య వ్రాపిందని అమ్మా, అన్నయ్యలు తొందరపడటం పొరపాటని లక్ష్మితో చెప్పి మళ్ళీ దాన్ని పనిలో పెట్టేవరకూ లత మాత్రం ఊరుకోలేకపోయింది.

# మానవత్వం అంటే

పదేళ్ళ పాప. పేరు రూప. ఆమె తండ్రి మీద పగబట్టిన వో పాపారావు ఉన్నట్టుండి రూపను ఎత్తుకుపోయాడు. ఎత్తుకుపోయి నిర్దయగా రూప, తండ్రి మీద కక్ష సాధింపుగా ఆమె చేతులు మణికట్టు వరకు అమానుష్యంగా నరికేశాడు. పాపారావు సాధించిన ఘోర విజయాన్ని రూప తండ్రి కళ్ళారా చూచి, కుళ్ళి కుళ్ళి ఏడ్వాలనీ, మళ్ళీ లేవకుండాపోవాలనీ కోరుకున్నారు. అందుకు రూపను వూళ్ళో దిగబెట్టి, పట్టపగ్గాల్లేని ఆనందోత్సాహా [illegible] పడ్డాడు.

పాపారావు అనుకున్నట్లే జరిగింది. రూప తండ్రి కుమిలి కుమిలి ఏడ్చి మంచంపట్టాడు. కొన్నాళ్ళకే ఆ మంచం శాశ్వతంగా ఖాళీ అయింది. కాలం కదిలిపోయింది. పదేళ్ళు జరిగిపోయాయి. పాపారావును పోలీసులు పట్టుకోలేకపోయారు. కాని అతన్ని కుష్ఠు రోగం పట్టుకుంది. అతని పాప కార్యాలకు సంకెళ్ళు వేసింది. అంతటితో కథ అడ్డం తిరిగింది.

ఆ రోజు సాయంత్రం అప్పుడే ఇంటికొచ్చి, కారు దిగుతున్న రూప, వీధిలో భిచ్చమెత్తుకుంటున్న కుష్ఠు రోగిని చూచి నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. కళ్ళు నులుముకొని మళ్ళీ మళ్ళీ చూసింది. నిజమే. సందేహంలేదు. ఆ భిక్షగాడు పాపారావే. రూప హృదయం వో క్షణంపాటు తత్తరపడి, తన్ను తాను సంభాళించుకుంది. మరుక్షణమే అతన్ని పిలిపించి కడుపు నిండా భోజనం పెట్టించింది. అందరూ అదోలా చూస్తోంటే, ఆమె మాత్రం ఏదో అనిర్వచనీయమైన అనుభూతితో తదేకంగా అతన్నే చూస్తోంది. ఆశించని ఈ ఆదరణకు కారణాలను వూహించే వ్యవధి లేకుండా పాపారావు తృప్తిగా విందారగించి ముగించగానే, అంతవరకు కను విందుగా చూస్తోన్న 'రూప' ''పాపారావు'' అంటూ ఆప్యాయంగా పిలిచింది.

తుళ్ళిపడ్డాడు పాపారావు. వెర్రి మొహంతో నిర్లిప్తంగా చూస్తున్నాడు. ''పాపారావు, కంగారుపడకు, నేను రూపను, నీ పాత విరోధి కూతుర్ని ఇదిగో కావాలంటే చూడు'' అంటూ కొంగుచుట్టున దాచుకున్న మొండిచేతులు రెండూ బయటపెట్టింది. రూప. పాపారావు నోట మాట రాదు. అతని తల తిరిగిపోతోంది. కళ్ళు తడబడుతున్నాయి. కాళ్ళు వణకిపోతున్నాయి. ఆ నిశ్శబ్ద సందిగ్ధం భరించలేని రూప. రుద్ధకంఠంతో మళ్ళీ అంది ''పాపారావు, ఇన్నాళ్ళకు నేను నీ మీద పగ సాధించగలిగినందుకు సంతోషంగా ఉంది. అయితే విందు భోజనం పెట్టి సత్కరించడం పగసాధింపు ఎలా అవుతుందనుకొంటున్నావ్ గదూ! అవును పాపారావు, మనిషిలో మానవత్వం అంటూ ఉంటే ఆ మనిషి పగసాధింపు ఇలానే ఉంటుంది. అది సరేగాని మానవత్వం ఉన్న మనుష్యులు కొందరు ఇక్కడకు దగ్గర్లోనే నిర్వహిస్తున్న కుష్ఠు రోగుల ఆశ్రయం ఒకటి ఉంది. నిన్ను అక్కడికి పంపే ఏర్పాట్లు చేయిస్తున్నాను. సుఖంగా జీవించు'' అంటూ లోపలికి వెళ్తున్న రూపలో దేవుడి స్వరూపాన్ని వెదకుతోన్న పాపారావు, చెంపలమీద కన్నీటి ధారలు కట్టలు తెగినట్లుగా ప్రవహిస్తున్నాయి.

ఇది కథ కావచ్చు. కాని మానవత్వం అంటే ఇదే అనడం అర్థరహితం కాకపోవచ్చు. పాపభూయిష్టమై, [illegible] మానవత్వాన్ని కోల్పోయిన మానవజాతి కోసం తన ప్రాణాన్నే బలిగా అర్పించిన ఏసుదేవుడు మనిషికి మరోమారు మానవత్వాన్ని ప్రసాదించగల మహాదేవుడు. ఆ యేసుదేవుని తెలుసుకోవడం మానవత్వాన్ని మళ్ళీ కనుక్కోవడమే అవుతుంది. ఆయన్ను సాక్షాత్తూ భగవంతుడిగా అంతరాత్మలో కలిగివుండడం మానవత్వం ఉన్న మనిషిగా ఉండటమే అవుతుంది.

బి. ఎ. ప్రతాప్‌కుమార్

ఉచితం! ఉచితం!!

దేవుని శాశ్వత ప్రేమను తెలిసికొని నిత్యజీవమును పొందకోరేవారు నేడే మాకు వ్రాయండి. మీకు ఉచితంగా 300 పేజీలుగల చక్కని పుస్తకమును మా తపాలా ఖర్చులతో పంపగలం.

**ఎ. యం. జి.**

**పోస్టు బాక్సు నెం. 1820, హైదరాబాదు—500020 (ఆం.ప్ర.)**




డి. ఎస్. ఎస్. బివిఆర్ ఎమ్.

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. ఎలా చెప్పాలో తెలియడంలేదు. నీవు చెప్పే పద్ధతి అపాయము లేనిదిగా ఉండాలి. నాకు ఫైట్స్ రావు. పాటలు సరిగ్గా రావు. . . .

నీ చిత్త క్షోభ అర్ధమైంది ప్రేమికా! అందుకేహీరోలా వోలెంపకాయ కొట్టో, కొట్టించుకొనో ప్రేమలో పడడం చెప్పను. స్వంతంగా పాడి భయపెట్టమనీ చెప్పను. డబ్బుంటే హాయిగా డ్యూప్‌ని పెట్టుకో— సాధారణంగా హీరోలకి లేని ధైర్యం వాళ్ల డ్యూపులకి ఉంటుంది.

కె.ఆర్.బి. కె.జె బి.కె ఎస్. — కాజూరు

స్త్రీప్రధానిగా ఏలుతున్నకాలంలో యిటువంటి స్త్రీల మానభంగాలు మితి మీరడం స్త్రీ జాతికి అవమానం కాదా?

ఎవరేలుతున్నా,యీ పరిస్థితిఅవమానకరమే కాని — ఒకటీ అరా స్త్రీల అభ్యున్నతికీ— స్త్రీజాతి జాతిగా అభ్యున్నతిగాంచడానికీ సంబంధం లేదని యీ స్థితి నిరూపిస్తూంది. వో ప్రధానీ, వో గవర్నరూ, వో పోలీసు అధికారీ మహిళ అయితే ఆడ జాతికేం ఒరగదని నిరూపిస్తున్నారు.

డి. వి ఆర్. — చిట్టివలస

మాట మాటకి మా పెద్ద మామయ్య అంటూ వుంటారు. ఎవరండీ మీ పెద్ద మామయ్య ?

మా పెద్ద మామయ్యే ! నున్నటి గుండూ, బుర్ర మీసాలూ చూసి ఏ దోపిడీ దొంగో అనుకోవచ్చు. కాని ఆ ఖద్దరూ ఆకళ్ల చిలిపితనం చూస్తే ఉట్టి గాంధీయవాది అని తెలిసిపోతుంది ! అహింసావాదిగా ఉంటూనే మహా హింస పెట్టేస్తాడు — ఉవాచలతో!

విజేంద్ర — ఆదోని

రచయితల రచనలవల్ల మన సమాజంలో మార్పు తెప్పించేందుకు అవకాశం ఉందా?

రచనలు సమాజాన్ని మార్చకలవో లేదో కాని వ్యక్తులపై తమ ప్రభావాన్ని మంచికో చెడుకో చూపెట్టే అవకాశం ఉంది.

జె. ఎఫ్. — ఒంగోలు

వన్యమృగాల సంరక్షణ, ఇంటికో చెట్టు ఇలా సంరక్షించుకుంటూపోతే మనంఉండటానికిచోటుండదేమో ?

మానవుడు మాత్రమే ఇంత స్వార్థంగా ఆలోచించకలడనుకుంటాను. ఇలాగే చెట్లు చేమలూ, గాలీ వెల్తురూ అనుకుంటే — మనిషి ఎక్కడ ఉండేవాడో ?

కబీరు — అనంతపురం

మీలాంటి రచయిత్రులు వ్రాస్తున్న రచనలు మొదటి పది పేజీలు చదివి, ముగింపు గ్రహించి చెప్తున్న పాటకులు గొప్పవాళ్లా ? వాళ్లలో అంత ఆలోచనా శక్తి కల్గిస్తున్న రచయితలు గొప్పవాళ్లా?

ఒకరి గొప్ప ఒకరిపై ఆధారపడి ఉంది కనుక ఇద్దరు గొప్పవాళ్లేనండీ.

కె. పి. — కొత్తపేట

తినగ తినగ వేము తీయగనుండు అన్నారు. చేదు తీపి ఎలా అయింది ?

ఏం లేదు. అలవాటైతే కష్టాలు సుఖంగానే తోస్తాయని దీని అర్థం.

ఎమ్. వి. కె ఆర్. కర్నూలు

ప్రశ్నావళిలో మీ పేరు తప్ప వేరే పేర్లు కనిపించదే. పేర్లు కనిపించినా ఎ.పి.లుగానో జి.ఒ.లుగానో ఉంటాయి.

అందరు పాటకులూ ఒక్కలా ఉండరు, అన్ని ప్రశ్నలూ ఒకలాగ ఉండనట్టే. ఏ పుట్టలో ఏ పాముందో అన్నట్టు ఏ పేరు ఏ వూరు, ఏ గొడవకి దారితీస్తుందోనని ఈ ఎ.పి.లూ., జి.ఒ.లూ!

పి. ఆర్. ఎస్. ఖమ్మం

రామలక్ష్మిగారూ! మీరు దేవుణ్ని నమ్ముతారా? నమ్మరా?

నమ్ముతాను. అయితే ఏ దేవుణ్ని అని అడక్కండి.

ఎ. బి. విజయనగరం

పురాణాలు నారదుణ్ని కలహ ప్రియుడని చాటాయిగాని, కలియుగంలో స్త్రీలే కలహప్రియులని అంటాను.

అలాగా? వోసారి ఆఫీసులో పని చేసే అమ్మాయిలని అడగండి, నిజం చెప్తారు.

ఆనారా — ఖర్గపూరు

నవ్వే ఆడదాన్నీ ఏడ్చే మగవాడినీ నమ్మకూడదంటారెందుకు ?

ఏం లేదు. నవ్వుతూ ఆడది మంచేయ కలదు. ఏడుస్తూ మగవాడు బాధ్యతలు తప్పించుకోకలడు. అందుకని!

పి; వి; సిద్ధవటం

మీరగా మీవారిని అందరిలాగా కట్నమిచ్చికొనే ఉంటారు. కాని వేదికపై కొచ్చేసరికి కట్నాల గురించి ఎడాపెడా ఏకేస్తారు. ఏమిటి మీ ఆత్మవంచన స్వభావం ?

మీకేమైనా పిచ్చా వెర్రా ! నాకర్థం కావటం లేదు. కామెర్ల రోగికి లోకం సర్వం పచ్చగా కన్పిస్తుందట. మీకూ అదే అని నా నమ్మకం ఆత్మవంచన ఎందుకు చేసుకోవడం? పరవంచన చేస్తే పాపమో పుణ్యమో దక్కేటప్పుడు?

ఎన్. ఎన్. ఆర్. కటక్

జీవితంలో మనిషికి కావలసింది ఏమిటి?

నిశ్చింత!

జి. ఎమ్. ఆర్ భిలాయి

కూలివాళ్లు ఎందుకు సమ్మెలకి సిద్ధపడతారు?

చిన్న చిన్న పళ్లుండే చక్రాలకి తెలియదా—అవి లేక యంత్రం తిరగదని?!

ఎమ్. ఎస్. ఆర్. మణుగూరు కాలరీస్

నవలలో హీరో హీరోయిన్‌లను కలుపుటకు ఎక్కువ ట్రయినుల్లో కలిసినట్టు రాస్తారు. ఇక ఎక్కడా కలవకూడదా ?

కలవచ్చు — బహిరంగ స్థలాల్లో, బస్సులు, పార్కులు, రైళ్లు, రోడ్లు,సినిమాహాళ్లు, ఆఫీసులు, లేకపోతే గుళ్లు, ఇవి కాక కొత్తగా లైబ్రరీలు, లాబ్‌లు వస్తున్నాయి. ఏరోప్లేన్లు వస్తున్నాయి. ఇంకా ఏం కావాలి మీకు?

వెంకట్. ఉరవకొండ

పాఠ్య గ్రంథాలు చూసి పరీక్షలు రాసే విధానం ?

ప్రమాదకరం. పుస్తకాల్లోనే తప్పులు ఎక్కువ ఉన్నాయి అంటున్నారు.

జె. ఎస్. ఆర్. హైదరాబాదు

అనుభవానికి నిర్వచనం ఏమిటి?

ఉద్యోగానికి వయసు మళ్లి పోయేటప్పటికి మీరు సాధించినదే అనుభవం! అన్నీ అయిపోయాక మిగిలేదీ అదే!









**రామం ఉలిక్కిపడి లేచాడు. రేడియం డయల్ వాచ్ ఒకటిన్నర చూపిస్తోంది. కొద్దిసేపు తనకెందుకు మెలకువ వచ్చిందో, అసలెక్కడున్నాడో కూడా అంతుపట్టలేదు. అప్పుడు గుర్తొచ్చింది.**

భోజనాలయిన తరువాత బెడ్‌రూమ్‌లో ఉక్కగా ఉంటే చాప వేసుకొని వరండాలో పడుకొన్నాడు తాను. బయట సన్నగా చినుకులు పడుతున్నాయి. చలిగాలి వీస్తోంది. ఇంటిలో నుండి సన్నగా మూలుగు వినబడుతోంది. ఇల్లంతా చిమ్మచీకటిగా ఉంది. ఒక్కగదిలో కూడా బెడ్‌లైట్ లేదు. గబగబాలేచి లుంగీ సర్దుకొని, తలుపు తట్టాడు.

మూలుగు పెద్దదయింది. ఆ మూలుగు తోంది తన భార్య లక్ష్మి అని గుర్తించాడు రామం. గుండె వేగం హెచ్చింది. చలిగా ఉన్నా వళ్లంతా చెమట పట్టింది.

'లక్ష్మికి మళ్లీనొప్పి మొదలయినట్లుంది' అనుకున్నాడు మనసులో. దీని కంతటికీ కారణం తన అశ్రద్ధే. రెండు మూడు రోజుల నుండి చెబుతూనే ఉంది. అయినా తాను పట్టించుకోలేదు. ఆరోజు పగలుకూడా పెద్ద పని లేదు. లక్ష్మిని ఆసుపత్రికి తీసుకెళ్లాల్సింది. కాని తీసుకు వెళ్లలేదు. అశ్రద్ధ !!

మళ్లీ తలుపు తట్టాడు. "వస్తున్నా" అంది లక్ష్మి ఆయాస పడుతూ. మంచం మీద నుండి లేచిన శబ్దం. అడుగులచప్పుడు. తలుపుతెరుచుకుంది. లక్ష్మిఆయాసపడిపోతూ, మూలుగుతూ నేలమీద చతికిల బడింది. రామం ఖంగారుగా లైటు స్విచ్ ఆన్‌చేసాడు. లక్ష్మి నొప్పితో మెలితిరిగి పోతోంది. లక్ష్మిని ఆ పరిస్థితుల్లో చూస్తుంటే రామానికి కాళ్ళు, చేతులు ఆడటంలేదు. తన అశ్రద్ధకు తనను తాను తిట్టుకున్నాడు.

"ఏమండీ! దాహం" అన్నది లక్ష్మి నాలుకతో పెదాలు తడుపుకొంటూ. రామం వంట గదిలోనికి పరిగెత్తాడు. బెడ్ రూమ్‌లో పిల్లలిద్దరూ ప్రశాంతంగా నిద్రపోతున్నారు. గ్లాసుతో నీళ్ళు తీసుకువెళ్లి, లక్ష్మిని చేతుల మీద పట్టుకొని నీళ్ళు త్రాగించాడు.

లక్ష్మి ఏడుస్తోంది. "ఏమండి ! నే నిక బ్రతకను" అన్నది లక్ష్మి ఏడుస్తూ. రామానికి దుఃఖం ముంచుక వచ్చింది.

"లక్ష్మీ! ఏమిటా మాటలు. నిన్నెలాగయినా రక్షించుకుంటాను" అన్నాడు తెచ్చిపెట్టుకున్న ధైర్యంతో. లక్ష్మి గోడకు జారబడి కళ్ళు మూసుకుంది.

గ్లాసు ప్రక్కన పెట్టి, రామం ప్రక్కపోర్షను వేపు నడిచాడు. ఎంతోసేపు తరువాత తలుపు తెరుచుకొంది. "ఎవరూ" అంటూ, కళ్లజోడు సవరించుకుంటూ శర్మమాష్టారు బయటికి వచ్చారు.

## ఒక్క రూపాయి చాలు

"నేనండి మాష్టారూ రామాన్ని! నా భార్య లక్ష్మి, విపరీతమయిన కడుపు నొప్పితో బాధ పడిపోతోంది. హాస్పిటల్‌కి తీసుకు వెళ్ళాలి" అన్నాడు.

"అయ్యో, అలాగా! నన్నేం చేయ మంటావు నాయనా" అన్నారాయన.

"క్షమించాలి. మీకు నిద్రా భంగం కలిగించాము. పిల్లలిద్దరూ నిద్రపోతున్నారు, యింటిలో తోడెవరూ లేరు. కాస్త బామ్మ గారిని పిల్లల దగ్గర..."

"దానికేం నాయనా! కాని మీ బామ్మగారు ఊరెళ్ళింది, నేనుంటాలే పిల్లల దగ్గర" అని, పై కండువా వేసుకొని తలుపు దగ్గరగా వేసి రామం వెనకాలే నడిచారు శర్మ మేష్టారు.

లక్ష్మి బాధతో మూలుగుతోంది.

"లక్ష్మి! నేనిప్పుడే రిక్షా తీసుకు వస్తాను, హాస్పిటల్‌కి వెళ్దాం. అంతవరకు కాస్త ఓర్చుకో"

"పిల్లలు ఒక్కళ్ళూ..."

"వాళ్ళదగ్గర నేనుంటానమ్మా" అన్నారు శర్మగారు.

రామం షర్టు వేసుకొని బయలుదేరాడు. చినుకులు కొంచెం పెద్దవయ్యాయి. ఈదురు గాలి కొడుతోంది. అది టౌనుకు దూరంగా విసిరి వేయబడి నట్లున్న ఓ కాలనీ. హాస్పిటల్ ఊరికి మరో చివరన ఉంది. ఆ కాలనీలో రిక్షాలు దొరకవు, దొరికినా ఆ కాలనీ నుండి హాస్పిటల్‌కి సామాన్యంగా రావు. అందు లోనూ యిటువంటి అర్ధరాత్రి సమయంలో, వర్షంలో అసలు రావు. ఆ సంశయంతోనే, రామం వీధి చివరివరకు నడిచాడు. ఒకటి, రెండు కుక్కలు మొరుగుతున్నాయి. వీధి చివర్ని మూడు రిక్షాలు కనపడ్డాయి. రామం కళ్ళలో ఆశ తళుక్కుమంది. భగవంతుడిని మనసులోనే ధ్యానించు కున్నాడు. మూడు రిక్షాల్లోను రిక్షావాళ్ళు గాఢనిద్రపోతున్నారు.

మొదటి రిక్షావాడి దగ్గరికి వెళ్ళాడు రామం. "రిక్షా" అంటూ పిలిచాడు. రిక్షా వాడు కదలలేదు.

"రిక్షా" అంటూ స్వరం హెచ్చించి పిలిచాడు. అంతకీ రిక్షావాడు కదలలేదు, మెదలలేదు. మంచి నిద్రలో ఉన్నట్టున్నాడు. కొంచెం తటపటాయిస్తూనే రిక్షావాడిని

చేతితో తట్టాడు. అతడు కొద్దిగా కదిలాడు. కడబడుతూ "ఇదిగో రిక్షా, వస్తావా" అని పిలిచాడు రామం.

"ఓరది" అన్నాడు రిక్షావాడు విసుగ్గా.

"రిక్షా! ఆసుపత్రికి వెళ్లాలి. పేషంట్ చాలా సీరియస్‌గా ఉంది" అన్నాడు రామం.

"ఏందయ్యా! అర్ధరాత్రి పూట, వర్షంలో ఆసుపత్రికి. బంగారం లాంటి నిద్ర పోగొట్టావ్. అయినా, అంత దూరం ఎవడొత్తాడయ్యా! ఉదయం ఎల్లొచ్చు తొంగో" అన్నాడు విసుగ్గా. రామం నీరుగారిపోయాడు.

"నా భార్య ప్రాణాపాయస్థితిలో ఉందయ్యా. కాస్త దయ ఉంచి..."

"నా బండి టైర్లు బాగాలేవు. ఆ పక్కోడు వత్తాడేమో పిలుచుకెళ్లు" అన్నాడు రిక్షావాడు ఆవులిస్తూ, ముసుగు సవరించుకుంటూ.

రామానికి క్షణకాలం ఏం చెయ్యాలో తోచలేదు. ఇంటిలో లక్ష్మి పరిస్థితి తలుచుకుంటుంటే దుఃఖం ముంచుకొస్తోంది.

ప్రక్కనున్న రిక్షావాడి దగ్గరకు వెళ్లాడు. అతడు కూడా గాఢ నిద్రలో ఉన్నాడు. అంతకంతకూ వర్షం జోరెక్కువవుతోంది. అతన్ని అతి కష్టంమీద నిద్రలేపి, విషయం చెప్పాడు రామం.

"అంతదూరం నేరాలేను. పైగా మెరక. రెండురాత్రుల నుండి సరిగా నిద్రలేదు, మరోడ్ని సూసుకోండి" అన్నాడు వాడు విసుగ్గా.

"నువ్వెంతయినా తీసుకో. దయ చేసి రావయ్యా" అని ప్రాధేయ పడ్డాడు రామం.

అయినా అతను వినిపించుకోలేదు.

"కష్టపడతా మంటే ఎవరూ పైసా యియ్యరు. యిసుమంటేలపుడు సెబుతారు తీపి కబుర్లు. నేను రాలేను" అని ముసుగు తన్నాడు.

రామానికి కళ్లనీళ్ల పర్యంత మయింది. గుండె వేగంగా కొట్టు కుంటోంది. కాళ్లు, చేతులు వణుకు తున్నాయి.

"భగవాన్! లక్ష్మిని కాపాడుకొనేమార్గం చూపు" అని మనసులో ప్రార్థించుకున్నాడు.

ప్రక్కనున్న రిక్షాలో నుండి ఓ ఆకారం కుంటుకుంటూ రామం దగ్గరకు వచ్చింది. అతడు మూడో రిక్షావాడు. చిరిగిపోయిన నిక్కరు, బనీను వేసుకున్నాడు.

"బాబుగారూ రిచ్చాకావాలా?!" అని అడిగాడు వాడు సౌమ్యంగా. రామానికి ప్రాణం లేచొచ్చింది

"అవునయ్యా, హాస్పిటల్‌కి వెళ్లాలి" అన్నాడు రామం ఆతృతగా.

"అట్టాగే బాబూ! నేనొత్తాను. ఆళ్లిద్దరికి డబ్బులు సేదయినట్టున్నాయి, ఏదవలు మణిసి కట్టంలో ఉంటే సూత్తా ఉన్నారు. ఛ. ఛ. యీళ్లేం మణుసులు బాబూ! ఉండండి బాబూ యిపుడేవత్తాను" అని కుంటుకుంటూ రిక్షాను లాక్కొచ్చి రామం ముందు నిలిపాడు

అతడు సాక్షాత్తు భగవంతుడే అనిపించింది రామానికి ఆ క్షణంలో. అప్రయత్నంగా రిక్షావాడి కాళ్లవేపు చూసాడు రామం.

**ఆలోచనల కొనలు**

ఆలోచనకు
ఆలంబన కావాలి!
ఆలంబన దొరికితే
అల్లుకుపోవాలి!
ఆ ప్రేరణకు చాలు
ఒకే ఒక్క క్షణం!
అదే—
అచ్చమైన కవితాలక్షణం!

— కలికిరి వి. అబ్దుల్ ఖాదర్

"ఎక్కండి బాబూ! ఆలోచించకండి. నేను కుంటోడినే గాని, యిమానం కంటే స్పీడుగా తొక్కుతాను బాబు. రండిబాబూ!" అన్నాడు రిక్షావాడు.

రామం ఎక్కి కూర్చొని "ఎంతిమ్మంటావ్?" అని అడిగాడు.

"నా కష్టంచూసి, మీకెంతివ్వాలను కొంటే అంతివ్వండి బాబూ. నే నెవ్వరిని యింతిమ్మని అడగను బాబూ. అయినా ఎవరెంతిచ్చినా, ఎవరికి దక్కేది వాళ్లకు దక్కుతుంది. ఇచ్చేవాళ్లు అడక్కపోయినా ఇత్తారు. ఇవ్వనోళ్లు అడిగినా యివ్వరు" అన్నాడు వాడు.

అతనన్నట్టుగానే కుంటివాడయినా చాలా హుషారుగా, స్పీడుగా తొక్కుతున్నాడు అతన్ని చూస్తుంటే యిదివరకెప్పుడో చూసినట్టనిపించింది రామానికి.

"ఇంత కష్టపడుతున్నావ్. నువ్విలా వేదాంతం మాట్లాడుతూ కూర్చుంటే నీ కడుపు నిండేదెలా?" అన్నాడు రామం. రిక్షావాడేం మాట్లాడలేదు ఇంతలో యిల్లు వచ్చింది.

రామం హడావుడిగా దిగి యింటిలోనికి పరిగెత్తాడు. శర్మగారు వరండాలో పడక కుర్చీలో కూర్చొని కునికిపాట్లు పడుతున్నారు. రామం అడుగుల చప్పుడు విని కళ్లుతెరిచారు. లక్ష్మి ఆయాసం యింకా ఎక్కువయ్యింది. మూలుగుతోంది.

"రిక్షా తీసుకువచ్చాను. హాస్పిటల్‌కి వెళ్దాం లే లక్ష్మీ" అన్నాడు రామం లక్ష్మి లేచే పరిస్థితిలో లేదు. తానే లక్ష్మి చీర సరిచేసి, రెండు చేతులతో ఎత్తుకొని రిక్షాలో ఎక్కించాడు రామం.

"జాగ్రత్తగా వెళ్లిరండి బాబూ! భగవంతుని ధ్యానించుకో. అంతా మంచే జరుగుతుంది. ఏం భయపడొద్దు" అన్నారు శర్మగారు.

రిక్షా కదులుతోంటే "నేను మీకు సేవ చేయాల్సింది పోయి మీచేత సేవ చేయించుకుంటున్నానండి" అన్నది లక్ష్మి ఆయాసపడుతూ.

"లక్ష్మీ! నువ్వేం మాట్లాడకుండా కళ్లు మూసుకొని పడుకో" అన్నాడు రామం అలసటగా. లక్ష్మి మరి మాట్లాడకుండా రామం భుజంపై తల ఆనించి కళ్లు మూసుకుంది.

కుంటి రిక్షావాడు రిక్షాను వేగంగా తొక్కుతున్నాడు. రిక్షా చాలా స్పీడుగా పోతోంది. వర్షం కురుస్తోంది. చలిగాలి వీస్తోంది. అతడు రిక్షా తొక్కుతుంటే ఓ ప్రత్యేకత కనిపిస్తోంది. ఆ రిక్షావాడిని యిదివరకెప్పుడో ఎక్కడో చూసినట్టుగా అనిపిస్తోంది. కాని ఎక్కడ, ఎప్పుడు చూసాడో స్పష్టంగా గుర్తు రావడం లేదు. కొద్దిసేపు తీవ్రంగా ప్రయత్నించాడు రామం. అప్పుడు గుర్తొచ్చింది. అవును! అతడే! ఈ రిక్షాలో యిదివరకొకసారి తాను ప్రయాణించాడు. ఆ రోజు...

...నైట్ కాలేజీలో ఫస్టవర్ తాను తీసుకోవాలి. అప్పటికే ఆలస్యం అయిపోయింది. సైకిల్ చెడిపోయింది. కాలేజీకి ఎలా వెళ్లాలో తోచక నడుస్తూ వీధి చివరి వరకు వెళ్లాడు రామం. అక్కడ ఒకే ఒక రిక్షా నిలబడి ఉంది. తన అడుగుల చప్పుడు

## ఒక్క రూపాయి చాలు

గేయాలు పంపేవారు వాటితో తపాలా కార్డు జత పరచవలసి వుంటుంది. గేయాలు తిప్పి పంపబడవు. గేయాలు, కవితలు సాధ్యమైనంత క్లుప్తంగా వుండటం మంచిది —సం.



విని "రిక్షా కావాలా సార్?" అంటూ ఆశగా అడిగాడు రిక్షావాడు.

"కాలేజీకి వస్తావా ?" ప్రశ్నించాడు తను.

"వస్తాను సార్" అన్నాడు వాడు రిక్షాను ముందుకు లాక్కొస్తూ.

"ఎంతిమ్మంటావ్?"

"దూరం బాబూ! రాత్రేళ, గతుకుల రోడ్డు. నాల్రూపాలిప్పించండి బాబూ."

"యింకానయం, పలభై రూపాయలిమ్మన లేదు. ఎవరో క్రొత్తవాళ్లనడుగుతున్నట్టు అడుగుతున్నావే. రెండు రూపాయిలిస్తాను, వస్తేరా, లేకపోతే లేదు." అంటూ ముందుకు అడుగు వేసాడు రామం.

"దయ చూపండి బాబూ ! నా కొడుక్కి జొరం, వళ్లు కాలిపోతూంది. ఒక్కగానొక్క కొడుకు. డాక్టరు బాబు నాలుగురూపాయలిస్తే చూడిస్తానన్నాడు. రెండు గంటల నుండి బేరాలు లేవు" దీనంగా చెప్పాడు రిక్షావాడు.

"భలేవాడివే ! ఈవాళ నీ కొడుక్కి జొరం, రేపు నీ పెళ్లాం బంగారు గొలుసు చేయించమంటుంది. అప్పుడు వేయి రూపాయిలడుగుతావా ? ఆఖరుసారిగా చెబుతున్నా, రెండున్నర కంటే ఒక్క పైసా ఎక్కువివ్వను" అన్నాడు ఖచ్చితంగా.

"ఎక్కండి బాబూ" అంటూ రిక్షాను ముందుకు లాగి నిలబెట్టాడు.

రామం టైమ్ చూసుకొని ఎక్కి కూర్చున్నాడు. కొంత దూరం లాగి, తరువాత ఎక్కి తొక్కడం మొదలు పెట్టాడు రిక్షావాడు.

"భలే రిక్షా దొరికిందయ్యా. రిక్షా పాతది. నువ్వేమో కుంటివాడివి. ఇక నేను కాలేజీకి వెళ్లినట్లే." విసుక్కున్నాడు రామం.

"రిక్షా పొద్దయినా, నేను కుంటాడ్నయినా మిమ్మల్ని అయిదు నిముషాల్లో కాలేజీకి చేరుస్తాను బాబూ" అన్నాడు వాడు హుషారుగా. అన్నట్టుగానే చాలా తొందరగా కాలేజీకి చేర్చాడు.

రిక్షా దిగి జేబు తడిమాడు రామం. అప్పుడు తెలిసింది వచ్చేటప్పుడు పర్సు తీసుకు రావటం మరచిపోయినట్టు. ఆ మాట చెప్తే లంటే నామోషీ అనిపించింది.

"వంద రూపాయల చిల్లరుందా" అన్నాడు చిరాకుగా.

రిక్షావాడు నవ్వాడు "వంద పైసలు లేవు సార్. లోపలికెళ్లి చిల్లర పంపించండి సార్. అంతవరకు ఆగుతాను" అన్నాడు వాడు.

రామం చకచకా మెట్లెక్కి కాలేజీలో ప్రవేశించాడు. సరాసరి స్టాఫ్ రూమ్‌లోనికి వెళ్లి లెక్చరర్‌తో సంభాషణం చేసాడు అక్కడి నుండి క్లాసురూమ్ వేపు దారితీసాడు ఒక్క క్షణం రిక్షావాడు మనసులో మెదిలాడు. 'ఆం! చూసి చూసి, వాడే పోతాడులే' అనుకొంటూ క్లాసులో ప్రవేశించి లెక్చరివ్వడంలో నిమగ్నమయిపోయాడు.

వరసగా రెండు క్లాసులు తీసుకొన్న తరువాత స్టాఫ్ రూమ్‌లోనికి వెళ్లాడు. అప్పుడతనికి మళ్లీ రిక్షావాడు గుర్తొచ్చాడు. వాచ్‌మన్‌ని పిలిపించి "బయట ఎవరయినా రిక్షావాడున్నాడా" అని అడిగాడు.

"లేదు సార్; రెండు గంటల క్రితం ఒక రిక్షావాడు కుంటుతూ లోపలికి రాబోయాడు, నేనే నాలుగుతిట్లు వెసిక్కి పంపించి వేసాను సార్. ఈ రోజుల్లో ఎవరిని నమ్మలేంసార్" అన్నాడు వాచ్‌మన్ భయభక్తులతో.

"మంచిపని చేసావ్" అని "పావలా దూరం లేదు అయిదులూ, పదులూ కావాలి. ఈ రోజుల్లో రిక్షావాళ్లకి గౌరవంగా కంట్రోల్ అనేది లేకుండా పోతోంది. వెధవలు" అని మనసులో అనుకున్నాడు రామం...

...అవును. అతనే యితను. పాపం ! వాళ్ళ కొడుక్కి జ్వరం అని ఏంతో ప్రాధేయపడ్డాడు. ఏమయిందో అనుకున్నాడు మనసులో రామం.

హాస్పిటల్ ముందు ఆగింది రిక్షా. రిక్షావాడు ఆయాసపడుతున్నాడు.

"బాబూ, హాస్పిటల్ వచ్చేసింది" అన్నాడు వాడు వగురుస్తూ. లక్ష్మి మూలుగుతోంది

రిక్షావాడి సాయంతో లక్ష్మిని ఎమర్జెన్సీ రూమ్ కి తీసుకువెళ్లాడు రామం.

డాక్టర్లు పరీక్షించి "టైమ్‌కి తీసుకు వచ్చారు. ఏమాత్రం ఆలస్యం అయినా మనిషి బ్రతికేది కాదు" అన్నారు. రామానికి కాస్త ధైర్యం చిక్కింది.

లక్ష్మికి ఇంజక్షన్ చేసి ఏవో మాత్ర లిచ్చారు

ఆ రాత్రికి హాస్పిటల్‌లో అడ్మిట్ చేసి, రెండు రోజుల్లో ఆపరేషన్ చేస్తామన్నారు. ప్రాణభయం ఏమాత్రం లేదని హామీ యిచ్చారు. రామం ధైర్యంగా ఊపిరి పీల్చు కున్నాడు లక్ష్మిని వార్డులో చేర్చేవరకు రిక్షావాడు రామంతోనే ఉన్నాడు.

రామం అణువణువు రిక్షావాడి మీద కృతజ్ఞతతో నిండిపోయింది కళ్లలో నీళ్లు తిరిగాయి— "యిదుంచు" అంటూ జేబులో నుండి వందరూపాయల కాగితం తీసి రిక్షా వాడి చేతులో పెట్టాడు.

రిక్షావాడు ఆ నోటుని అటూ యిటూ తిప్పి చూసి "బాబుగారు చీకటిలో సరిగా చూడలేదేమో! యిది వందరూపాయల కాగితం బాబూ! నాకు ఒక్కరూపాయిస్తిం చండి. చాలు" అన్నాడు.

"లేదు. చూసే యిస్తున్నాను. నీ మేలీ జన్మలో మర్చిపోలేను. నీకుఋణపడిఉన్నాను. ఎంతిచ్చినా నీ ఋణం తీర్చుకోలేను దయ చేసి యిది తీసుకో" అన్నాడు రామం ప్రాధేయపూర్వకంగా.

"ఓరికి, ఓరు ఋణం బాబూ! అమ్మ గారికి ఆయుష్షుంది. బ్రతికింది. యిందులో నేను చేసిందేముంది బాబూ" అన్నాడువాడు మామూలుగా.

"నువ్వేగనుక రిక్షాలో తీసుకురాకపోతే ఈ సరికి నా లక్ష్మి ప్రాణాలు అనంత వాయు వుల్లో కలిసిపోయేవి. నా లక్ష్మి ప్రాణాలు కాపాడావు. నీ కోసం కాకపోయినా నీ'కొడుకు కోసం తీసుకో" అన్నాడు రామం.

ఫేలవంగా నవ్వాడు రిక్షావాడు. "హా! కొడుకు! వాడు జొరంతో మంచానపడుంటే రెండు రూపాయలు సంపాదించలేకపోయాను. ఆడెప్పుడో మట్టయిపోయాడు. ఈ రోజు ఈ వందరూపాయలు తీసుకెళ్లి వాడెక్కడు న్నాడని యివ్వను బాబూ" అన్నాడు గద్గది కంగా.

రామాన్ని ఎవరో కొరడాతో ఛెళ్లునకొట్టి నట్టయింది.

"పోనీ నీ భార్య కోసం..."

"అదెక్కడుంది బాబూ! వాడి మీద బెంగతో మంచం పట్టి అదీ పోయింది. పాపా త్ముడిని నేను మిగిలాను. నా ఒక్కడి పొట్ట కెంత కావాలి సార్ ... ఒక్క రూపాయి చాలు" అని వంద రూపాయల కాగితం రామం చేతిలో పెట్టాడు

'నువ్వు కాదు పాపాత్ముడివి. నీ కొడుకు చావుకు కారకుడినయిన నేను పాపాత్ముడిని' అనుకున్నాడు మనస్సులో రామం. జేబులన్నీ వెతగ్గా నాలుగు పావలాలు దొరికాయి. అవి రిక్షావాడి చేతిలో పెట్టాడు.

వాటిని సంతోషంతో తీసుకుని "ధైర్యంగా వుండండి బాబూ... రెండ్రోజుల్లో అమ్మగారు ఆరోగ్యంగా నవ్వుతూ యింటికి వస్తారు" అని, కుంటు కుంటూ, రిక్షా లాగుతూ చీకట్లో కలిసి పోయాడు రిక్షావాడు.

# అవీ - ఇవీ - అన్నీ



తెనాలి పురపాలక సంఘం, కమిషనర్ వై.సి. మస్తాన్‌రావు ఆధ్వర్యంలో యిటీవల నిర్వహించిన ఆంధ్రప్రదేశ్ అవతరణ రజతోత్సవ కార్యక్రమానికి అధ్యక్షత వహించి ఉపన్యసిస్తున్న ప్రముఖ రచయిత డా. పి వి. రమణ. ప్రసిద్ధ కర్నాటక సంగీత విద్వాంసురాలు శ్రీమతి మాధవపెద్ది మీనాక్షి గారిని కూడా ఈ చిత్రంలో చూడవచ్చు.

## శతాబ్దాలుగా తెలుగు భాషా స్వరూపం

రచయిత శ్రీ కె. ఆర్. కె. మోహన్ రచించిన పరిశోధక వ్యాసాల గ్రంథం. 170 పుటలు, వెల 15 రూపాయలు. ప్రతులకు శ్రీముఖ పబ్లికేషన్స్, ప్లాట్ నెం. 12, హౌస్ నెం. 7—8, ఏ. అండ్ టి. కాలనీ, గడ్డి అన్నారం, హైదరాబాద్ 36 కి వ్రాయాలి.

## సుఖ జీవనం

తెనాలి మహిళా మండలిలో నవంబరు 9వతేదీన డా. పోపూరి వెంకటేశ్వర్లు రచించిన వైద్య గ్రంథం 'సుఖ జీవనం' డా. కె. వి. కృష్ణకుమారిచే ఆవిష్కరింపబడింది ఈ సభకు శ్రీ లంక అప్పారావు అధ్యక్షులు, శ్రీ విహారి ప్రారంభకులు. హిత శ్రీ డా పి. లక్ష్మీకాంతశర్మ, పూర్ణచంద్ ప్రభృతులు రచయితను, ప్రచురణకర్త స్పందన సాహితీ సమాఖ్య [బందరు]ను అభినందించారు.

## పువ్వుల దివ్వెలు

శ్రీ కన్నెకంటి రాజమల్లాచారి వ్రాసిన పువ్వుల దివ్వెలు కావ్యాన్ని శ్రీ పాలడుగు వెంకటేశ్వరరావు, గురజాల జూనియర్ కళాశాల ఆవరణలో ఆవిష్కరించారు. ఈ సభకు డాక్టర్ వి. వి. ఎల్. నరసింహారావు అధ్యక్షత వహించారు. కావ్యాన్ని అంకితం పుచ్చుకున్న శ్రీ ఎనుముల వెంకటేశ్వర్లు కవిని సత్కరించారు.

## ఉషస్సు

వచన కవితా సంకలనం. సంకలనకర్త : శ్రీ వాసవ్య. 24 పేజీలు. వెల రు. 1—10పై. ప్రచురణ : సంవేదన యువకవుల వేదిక, నూజివీడు. ప్రతులకు, వివేక్ న్యూస్ అకాడమీ, నూజివీడు 521 201.

## ముత్యాల పందిరి

వచన కవితా సంకలనం. సంకలన కర్త : శ్రీ ఎస్. కె నాగేశ్వరరావు. 48 పేజీలు. వెల : రు. 5. ప్రచురణ : త్రివేణి బుక్ లవర్స్ క్లబ్, పెనుగొండ, ప. గో. జిల్లా [ఆం.ప్ర.].

# డాక్టరు సలహాలు

**జి. ఎస్. ఎల్. — కడప**

నా వయస్సు 36 సం. లు. నాకు తెల్లవారు జామున కాళ్ల మడమలు నొప్పులుగా ఉంటాయి. కొద్దిసేపు నడిస్తేగాని నెప్పులు పోవు. రాత్రి పూట చేతులు తిమ్మిర్లుగా ఉంటాయి. మెలుకువ వచ్చిన తరువాత రక్తప్రసరణ జరుగనట్లుగా ఉంటుంది.

పై లక్షణాలు రుమటాయిడ్ ఆర్థ్రైటిస్‌నిగాని, పెరిఆర్థ్రైటిస్‌నిగాని తెలియజేస్తాయి. చేతులలోని, కాళ్లలోని చిన్న చిన్న కాళ్లు వాచి, నెప్పిగా ఉంటే రుమటాయిడ్ ఆర్థ్రైటిస్ అని నిశ్చయమవుతుంది. ఈ రోగం ఉన్నవారికి ఉదయాన నిద్ర లేవగానే కీళ్లు వంగవు.

తెల్లవారి లేవగానే వేడి నీళ్లలో కొంచెం సేపు ఉంచటం ద్వారా కొంత వరకు ఉపశమనం పొందవచ్చును. అసిటైల్ సాలిసిలిక్ యాసిడ్, ఫినైల్ బ్యూటోజోన్, పారాసిటమాల్ మొదలైన మందులు వైద్యుల సలహా ప్రకారం వాడవలసి ఉంటుంది. కార్టిసోన్ మొదలైన మందులను వైద్యులు కొందరు రోగుల పరిస్థితిని అనుసరించి వాడటం జరుగుతుంది.

**బి. వి. ఆర్. — కాకినాడ**

నా వయస్సు 18 సం. లు. మా కుటుంబంలో అందరూ పొడుగ్గా ఉంటారు. కాని నేను పొట్టిగా ఉంటాను. నా గొంతులో టాన్సిల్స్ ఉన్నాయి. అందుకే ఎదుగుదల లేదని అందరూ అంటున్నారు.

టాన్సిల్స్ ఉండటం అనేది ప్రకృతిసిద్ధమైన విషయం. పుట్టిన ప్రతివారికీ టాన్సిల్స్ ఉంటాయి. చిన్న పిల్లలకి పెద్దవారికి ఉన్నవాటి కన్నా టాన్సిల్స్ పెద్దవిగా ఉంటాయి.

టాన్సిల్స్ పెద్దవిగా ఉండడానికీ పొడుగు పెరగకపోవటానికీ శాస్త్రరీత్యా ఏ సంబంధమూ లేదు.

**ఎస్. వి. — విజయవాడ**

నా వయస్సు 22 సం. లు. నాకు పదవ ఏట కీళ్ల నెప్పులు వచ్చి తగ్గినది. తర్వాత గుండె జబ్బు ఉందని ఎక్స్‌రే, ఇ. సి. జి. తీసి, పరీక్ష చేసి అంతగా లేదన్నారు. ప్రస్తుతం నెలకొకసారి పెనిడ్యూర్—12 ఇంజక్షను తీసుకుంటున్నాను. ఇలా ఎన్నాళ్లు తీసుకోవాలి?

రుమాటిక్ ఫీవర్ అనే జ్వరం వచ్చిన వారికి శరీరంలోని పెద్ద కీళ్లు వాయటం, జ్వరం రావటం జరుగుతుంది. ఒక రోజు ఒక కీలు, మరొక రోజు ఇంకొక కీలు అనే విధంగా వేర్వేరు కీళ్లు వేర్వేరు సమయాలలో వాయటం జరిగిన కొన్నాళ్లకి, గుండె నెప్పి ఆయాసం మొదలైన లక్షణాలు ఏర్పడతాయి. హృదయంలోని కవాటాలు [వాల్వులు] సరిగా పనిచేయవు.

ఈ రోగం కీళ్ల వాపులకి మాత్రం పరిమితమయి ఉన్న సమయంలో దాదాపు 10 వారాలపాటు లాంగ్ యాక్టింగ్ పెన్సిలిన్ వాడితే హృదయం దెబ్బతినదని అంచనా. ఒకసారి హృదయంలోని కవాటాలు రోగగ్రస్తమయిన తరువాత పెనిడ్యూర్ వాడటంవల్ల పెద్దగా లాభం ఉండదు. పై విషయం దృష్ట్యా ఎన్నాళ్లు వాడాలనే ప్రశ్నే రాదు.

**ఎమ్. ఎ. — శ్రీకాకుళం**

మా బాబు వయస్సు మూడున్నర సం. లు. చిన్న చిన్న మాటలు, మాట్లాడతాడు. గ్రహింపు శక్తి ఉన్నది. మనము చెప్పినది తిరిగి చెప్పలేడు. తొందరగా మాటలు రావాలంటే ఏమి చేయాలి?

కొందరికి మాటలు ఆలస్యంగా రావటం సహజమే! పూర్తిగా మాట్లాడకపోతే ఆదుర్దాపడవలసి ఉంటుంది గానీ, కొన్ని మాటలు వచ్చి కొన్ని రాకపోవటం ఆలస్యాన్ని మాత్రమే సూచిస్తుంది. ఓపికగా మీ బాబు దగ్గర కూర్చుని మాటలు నేర్పటం మంచిది. మందులు దీనికిగాను ప్రత్యేకంగా ఏమీ లేవు. ఇతరత్రా వీక్‌నెస్ మొదలైనవి ఉంటే వైద్య పరీక్ష చేయించి తగిన మందులు వాడండి.

**కె. కె — బసాపుర**

దాదాపు 5 సం.ల క్రితం నాకు ఎడమకాలు, చెయ్యి కొద్దిగా తిమ్మిరి, నెప్పి ప్రారంభమయ్యింది. డాక్టరు చూసి ఎక్స్‌రే తీసి ఏమీ లోపం లేదని ఏవో ఇంజక్షన్లు చేస్తే రియాక్షన్ వచ్చింది. మళ్లీ ఏమీ వాడలేదు. క్రమంగా నెప్పి ఎడమ ప్రక్క అంతా వచ్చింది. వీపు నెప్పి, నడుము నెప్పి, మెడలు నెప్పి ఎక్కువగా వస్తాయి. వీటికి ఏమి చెయ్యాలి?

మెదడు భాగానికి నెత్తురు సరఫరా తగ్గినప్పుడు ఇలా కొన్ని లక్షణాలు ఏర్పడతాయి. మెదడు భాగానికి మాత్రమే గాక మిగిలిన రక్తనాళాలలో కొవ్వు వంటి పదార్థం పేరుకు పోవటం వల్ల ఆయా రక్తనాళాలలో రక్తం ఎక్కువగా ప్రవహించే అవకాశం ఉండదు. అందువల్ల ఆయా భాగాలలో తిమ్మిర్లు, నెప్పులు ప్రారంభమవటం జరుగుతుంది. ఆహారంలో క్రొవ్వు పదార్థాల వాడకం తగ్గించడం, రోజూ కొద్దిగానైనా వ్యాయామం చేయటం, బ్లడ్ ప్రెషర్ ఉంటే దానికి తగిన మందులు వాడటం ద్వారా ఈ లక్షణాలు తగ్గుతాయి. నెప్పులకి విటమిన్ బి. కాంప్లెక్స్ మాత్రల రూపంలోగాని, ఇంజక్షన్ల రూపంలోగాని వాడవచ్చును.

**ఎస్. ఎస్. — హైదరాబాదు**

నాకు వివాహమై 4 నెలలు అయ్యినది. 2 సం.ల వరకూ సంతానము కలుగకుండా కుటుంబనియంత్రణ అమలు జరుపుటకు నిర్ణయించుకున్నాము. గర్భము రాకుండా సులువైన మార్గమును తెలియపరచమని కోరుతున్నాను.

గర్భ నిరోధక మార్గాలు పురుషులు పాటించ తగినవి, స్త్రీలు పాటించతగినవి అనే విధంగా ఉంటాయి.

పురుషులకి కాయిటస్ ఇంటరప్టస్, నిరోధ్ వాడటం అనే మార్గాలు. స్త్రీలకి సేఫ్ పీరియడ్, కాంట్రాసెప్టివ్ మాత్రలు, ఫోమ్ పిల్స్ అనేవి మీకు వర్తించదగ్గవి. ఇప్పటికే పిల్లలు ఉన్నవారు లూప్ మొదలయిన సాధనాన్ని వాడవచ్చును. ఇద్దరు ముగ్గురు పిల్లలు ఉన్న పురుషులకి వాసెక్టమీ, స్త్రీలకి ట్యూబెక్టమీ చేయటం జరుగుతుంది.

అన్నింటికన్నా సులువైన మీకు వర్తించే మార్గం నిరోధ్ వాడకమే!

— డా॥ కె. వెంకటేశ్వరరావు,



# హైదరాబాద్ నోట్‌బుక్

—తిరుమల రామచంద్ర

**ఎత్తుకు పై ఎత్తు :**

ప్రభుత్వాలు వ్యాపారస్తుల, పారిశ్రామికుల చేతుల్లో ఉంటాయి. వాళ్ళు తలుచుకుంటే తిమ్మిని బమ్మిని బమ్మిని తిమ్మిని చేయగలరు. పూర్వం కూడా వ్యాపారస్తులు ప్రభుత్వాలకు అండగా ఉండేవారని చరిత్ర చెబుతూంది. ప్రభుత్వం ఎన్ని చట్టాలు చేసినా, వాటిని దాటి పోగల, వాటితో దూరిపోగల ఎత్తులు వారికి తెలుసు. దీనికి ఇటీవల జంట నగరాలలోని హోటల్ వ్యాపారుల చర్యలే తార్కాణం. హోటళ్లలో తినుబండారాల ధరలు తగ్గించాలని, తగ్గించకపోతే చర్య తీసుకుంటామని రాష్ట్రమంత్రులు హోటల్ యజమానులను బెదిరించారు. వారు సరే అన్నారు. ఒకఎత్తు వేశారు. స్పెషల్ అన్నారు. దానిధర ఎక్కువ. హోటళ్లకు వెళ్లి ఏ వస్తువు అడిగినా, స్పెషల్ పేరుతో మామూలు వస్తువే ఇచ్చి, ఎక్కువ ధర వసూలు చేయడం ప్రారంభించారు. కొన్ని హోటళ్లలో జనతాఇడ్లీ, జనతాపూరీ, జనతాదోసె అంటూ అమ్మేవి, పూర్వపు ధర్మసత్రాల వస్తువులకన్నా నికృష్టంగా ఉంటున్నాయి. మంత్రుల ఆదేశాలకు భయపడి హోటళ్ళు, మిటాయి దుకాణాలు ధరలు తగ్గిస్తాయని నగరవాసులు ఆశపడ్డారు. అది కేవలం అడియాస అయింది. అన్ని వస్తువుల ధర దాదాపు 15 శాతం పెరిగింది. మరి తమ ఆదేశాలు ఇలా అవహేళన పాలయినందుకు మంత్రులు ఏమనుకుంటున్నారో! వారికి చీమకుట్టినట్లయినా లేదా ?

**తప్ప తడిసిన పిల్లలు :**

నవంబర్ 14వ తేదీన బాలల దినోత్సవం సందర్భంగా నిజాం కళాశాల మైదానంలో జరిగిన బాలల ప్రదర్శనాలు వర్షంవల్ల సరిగా జరుగలేదు. పిల్లలు తప్ప తడిసినా అలాగే చాలసేపు విన్యాసాలు జరిపారు. వర్షం పడగానే పెద్దలంతా పరుగెత్తి ఆవరణలోని భవనాలలో తలదాచుకున్నారు. గాని, దాదాపు 20 వేల మంది పిల్లలు తలదాచుకోలేక తప్ప తడిశారు. మూడు రోజులుగా వర్షం కురుస్తున్నది గదా! వ్యవస్థాపకులు డేరాలన్నా వేయవలసింది. లేదా ఇండోర్ స్టేడియంలోనన్నా విన్యాసాలు ఏర్పాటు చేయవలసింది. ఈ గొడవలోనే ఇంటర్మీడియెట్, ఎస్. ఎస్. సి. పరీక్షలలో మొదటి పది స్థానాలు సంపాదించిన వారికి బహుమతులు, యోగ్యతాపత్రాలు ఇచ్చారు.



బొంబాయి తెలుగు ఫెడరేషన్ దసరా సమ్మేళన్ ఉత్సవాలను నిర్వహించింది. ఆ సందర్భంగా విచ్చేసిన మహారాష్ట్రమంత్రి శ్రీమతి శాలినీపటేల్ బొంబాయి తెలుగు ఫెడరేషన్ మాధ్యమిక పాఠశాలకు స్థలం కేటాయించడంలో శాయశక్తులా ప్రయత్నించగలమని హామీ ఇచ్చారు. అధ్యక్షులు శ్రీ దశరథ మధుకుంటా బొంబాయి తెలుగు సమాజానికిగల సమస్యలని వివరించారు. ఫెడరేషన్ అధ్యక్షులు డాక్టర్. య్యు. ఎస్. రావు స్వాగతం పలికారు. శ్రీయుతులు నారాయణరావు పుజారీ, నాగయ్య గుజ్జేటి, నారాయణరావు బత్తిని ఉపన్యసించారు. ప్రధాన కార్యదర్శి శ్రీ గంటి శంకరరావు వందనసమర్పణ చేశారు.

# ఉజ్జ్వల భవిష్యత్తులోకి ఆంధ్రప్రదేశ్



శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధాన మంత్రి)



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

ప్రధానమంత్రి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం కీ.శే. శ్రీ సంజయగాంధీ 5 సూత్రాల కార్యక్రమాన్ని మరింత పటిష్ఠవంతంగా అమలు జరపడానికి ప్రాధాన్యతనిస్తూ ఆంధ్రప్రదేశ్ యిప్పుడు రజతోత్సవ సంవత్సరాన్ని జరుపుకుంటోంది. నవంబరు నెల మొదటి 25 రోజులలో రాష్ట్ర అభివృద్ధికి సంబంధించిన వివిధ అంశాలను ప్రముఖంగా వివరించడం జరిగింది.

శ్రీ టి. అంజయ్య నాయకత్వంలో రైతులు, పారిశ్రామిక కార్మికులు, బలహీనవర్గాల పట్ల ప్రత్యేక శ్రద్ధ వహిస్తూనే సామాన్య మానవుని సంక్షేమానికి అనేక చర్యలు తీసుకున్నారు.

★ గ్రామాలలో రక్షిత మంచినీటి సరఫరా. రు. 480 కోట్ల పెట్టుబడితో కూడిన బృహత్ ప్రణాళిక రూపొందించబడింది

★ రు. 350 కోట్ల ఖర్చుతో పనికి ఆహారం కార్యక్రమం ద్వారా గ్రామీణ ప్రాంతాలలో ఉపాధి కల్పన.

★ అవినీతిని నిర్మూలించడానికి కృషి చేయడం ద్వారా స్వచ్ఛమైన పరిపాలన అందించడం లోకాయుక్త సంస్థ ఏర్పాటు చేయడానికి శాసనం ప్రవేశ పెట్టడం. అవినీతిని కనుగొనడానికి ఫ్లయింగ్ స్క్వాడ్ ఏర్పాటు చేయడం.

★ సమాజంలోని వివిధ మతాలు. భాషావర్గాలమధ్య సౌభ్రాతృత్వాన్ని పెంపొందించడానికి వీలుగా రాష్ట్ర సమైక్యతామండలి ఏర్పాటు చేశారు.

రజతోత్సవ సంవత్సరంలో వివిధరంగాలలో అభివృద్ధి కార్యక్రమాలను తీవ్రతరంగా అమలు జరుపడానికి ఒక్కో నెలను ప్రత్యేకించారు

| | | |
|---|---|---|
| డిసెంబరు | ... | ఇళ్ళ స్థలాలు |
| జనవరి | ... | వ్యవసాయ భూములు |
| ఫిబ్రవరి | ... | ఋణాలు |
| మార్చి | ... | గ్రామీణ విద్యుద్దీకరణ |
| ఏప్రిల్ | ... | కుటుంబ సంక్షేమం |
| మే | ... | కార్మికులు, వృత్తి పనివారు |
| జూన్ | ... | రైతుల సంక్షేమం |
| జులై | ... | వన మహోత్సవం |
| ఆగస్టు | ... | చేనేత పనివారు |
| సెప్టెంబరు | ... | మహిళలు, శిశు సంక్షేమం |
| అక్టోబరు | ... | యువజన సంక్షేమం |

సమాచార, పౌర సంబంధశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటితం.

DIPR No. 40645/Advt/C I 3/80

## స్త్రీ బుద్ధి ...!

ఢిల్లీకి చెందిన ప్రేమలత నైట్‌క్లబ్ పాటకి వో ట్రూపుతో కెనడా వెళ్ళి తిరిగివచ్చి, తన భర్త తిలక్‌రాజుతో తానక్కడ 23 ఏళ్ల జితేంద్ర అనే అతన్ని ప్రేమించినట్టు, అతన్ని పెళ్లిచేసుకోదల్చుకున్నట్లు ప్రకటించిందట. వారికి 21, 20—వయస్సున్న యిద్దరు కొడుకులు, 15 ఏళ్ల కూతురూ ఉన్నారట. భార్య సంపాదన మీదే బతుకుతున్న తిలక్‌రాజు ఏమీ అనలేక పోయాడట. 43 ఏళ్ల తన భార్య పెళ్లీడు కొచ్చిన పిల్లలుండి తను 23 ఏళ్ల కుర్రాడి మోహంలో పడి పోవడంతో అతనికి మతి పోయినట్టయ్యిందట.



## ఫైళ్ళ డైరి

కెనడా నుంచి జితేంద్ర వచ్చాక వారిద్దరూ చేరి భార్యాభర్తలకన్నా అన్యోన్యంగా వుండడంతో తిలక్‌రాజు తప్పించుకు తిరిగేవాడట. జితేంద్ర తన తండ్రి కాశ్మీర్‌లో చాలా ధనవంతుడనీ, నాలుగైదు మేడలు ఉన్నాయనీ అబద్ధం చెప్పాడట ఆమెతో. ప్రేమలత బలవంతం మీద ఆమెను తన యింటికి తీసుకువెళితే అక్కడ తన తలిదండ్రులు అతన్ని ఇంట్లోకి రానివ్వలేదట. తనతో అన్ని అబద్ధాలు జితేంద్ర చెప్పాడని ఆమె బాధ పడ్డదట. ఆనక ఢిల్లీవచ్చాక నేను నిన్ను ఎంతగానో ప్రేమించాను నువ్వునన్ను మోసగించావు. అబద్ధాలెందుకు చెప్పావు అని అతన్ని నిలదీస్తే తాను పన్నెండేళ్ల క్రితం వో హత్యచేసినట్టూ, ఆనక కెనడా పారిపోయినట్టూ కూడా అతను చెప్పాడట. దాంతో ఆమె మనస్సు విరిగిపోయి, ఇహ తనకు ఆత్మహత్యే శరణ్యం అని నిర్ణయించిందట. పాలలో నిద్ర మాత్రలు కలుపుకుని యిద్దరూ తాగిరట. తమను నిద్రలేప వద్దని పిల్లలతో చెప్పారట. ఆ రోజేగాక, మర్నాటి వరకూ తలుపులు తెరుచుకో బోయేసరికి పిల్లలు పక్కవారికి, వారు పోలీసులకూ చెప్తే వారొచ్చి తలుపులు పగలేసి చూస్తే లోపల యిద్దరూ నగ్నంగా ఒకరినొకరు పెనవేసుకుని పడిఉన్నారట. జితేంద్ర శవం కొంచెం వాసన కూడా కొట్టిందట. అతని శవాన్ని ఆస్పత్రి కి తీసేసరికి ప్రేమలత వూపిరి పీల్చుకుంటూ వుందట. దాంతో ఆమెను గవర్నమెంటు ఆసుపత్రిలో చేరిస్తే బ్రతికిందట. ఆసుపత్రి నుంచి తిరిగివచ్చాక ఆమె మళ్లీ నైట్‌క్లబ్‌లలో తన వృత్తి నారంభించిందట. ఇది 1979 మే 29న జరిగిందట. ప్రేమలతకు ఎంత పలుకుబడి ఎక్కడెక్కడున్నదో కానీ, ఆత్మహత్య ప్రయత్న నేరం ఆమె మీద ఏడాది క్రితం మోపబడి, బెయిలులో విడుదలయి, ఆ కేసు అతీగతీ లేకుండా ఉన్నదట యీనాడు. ఆమె స్వేచ్ఛగా చీకూచింతా లేకుండా ఉన్నదట.

## రాతి నీరు!

రాయిలోంచి నీరును తీయవచ్చని రష్యా కనుక్కున్నదట. భూగర్భం నుంచి తీసిన వో రాయిని మెటల్ జాకట్టులో పెట్టి ఒక ఘన అడుగుకి పది టన్నుల శక్తితో ఆ రాయిని పీడిస్తే నీటి చుక్కలు ఆ రాతి నుంచి మెటల్ జాకట్టుద్వారా రాల్తాయనీ, యీ నీరు మామూలు నీరు కన్నా లోహాన్ని కరగించు శక్తి సుమారు యిరవైరెట్లు ఎక్కువట— తివిరి యిసుమున తైలంబు తీయవచ్చు అన్నాయనెవరో అననే అన్నారు కదా!

## ఆపదపాలైన అమాయకుడు!

మొరదాబాద్‌కు చెందిన అసలత్‌పురాలో ఇటీవల జరిగిన పోలీసు కాల్పుల్లో అనుకోని విధంగా మహమ్మద్ దవుఫిక్ అనే అతనికి గుండు దెబ్బ తగిలిందట. వెంటనే పోలీసు ఆఫీసరు అతన్ని ఆసుపత్రిలో చేర్చాడట. అంతేగాక, అతనికి రక్తం అవసరమైతే తాను, తన తోటి పోలీసులూ రక్తదానం కూడా చేసి ఆతని ప్రాణాలను నిలబెట్టార్టట.

## కన్నందుకు తప్పుతుందా!

నటుడు, నిర్మాత, దర్శకుడు రాజకపూరు ఆఖరి కొడుకు రాజీవ్‌కపూర్ ఇంకా సినిమాలోకి రావాలనుకోటం లేదట. ఇప్పుడిప్పుడే ఉషారు పుట్టి రుయామ్మని బొంబాయి వీధుల్లో దూసుకు పోతున్నాడట. మొన్న సెప్టెంబరు 14వ తేదీన వో మాంచి బెంజీ కారులో ఒబరాయ్ టవర్సు [బొంబాయి] వైపు దూసుకుపోయి, ఆ వేగంలో దీపక్‌షా,ముసా షిక్ అనే ఇద్దరు గొప్పవాళ్ల కార్లను గుద్దేశాడట. దాంతో వారాతన్ని పట్టుకొని పోలీసులకు వప్పగిస్తే రాజకపూర్ విడిపించుకొచ్చి తలరాతరా బాబూ! అన్నారట తల బాదుకుంటూ.

## ఆవేశంతెచ్చిన అనర్థం!

కణ్ణాన్‌కురుచ్చి అనే వూరుకు చెందిన చెట్టియప్పన్ అనే పోలీసు కానిస్టేబులు తాను యింట్లో పెట్టుకున్న తొమ్మిది రూపాయలు కనబడలేదని ఇంట్లో ఉన్న భార్యను, కొడుకునూ ఒట్టేయమన్నాడట. దానికి భార్య జంకే సరికి నువ్వే తీసి వుంటావని ఆమెను పుచ్చుకుని చితక బాదాడట. దాంతో ఆగ్రతం వచ్చిన ఆతని కొడుకు జగన్నాథన్ చేతికందిన చిన్న కత్తి తీసుకునితండ్రిని కసకసా పొడిచి చంపేశాడట.



Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.